


సాహిత్య

# ప్రస్థానం

సెప్టెంబరు 2012

వెల రూ. 10











# అక్షరాంజలి










సాహితీ స్రవంతి

సాహిత్య ప్రస్థానం
సంపుటి : 11 సెప్టెంబర్ 2012 సంచిక : 09

# మహానుభావులు...

భాషా వేత్తలు, కళా కోవిదులు,
బోధకులు, పరిశోధకులు
జ్ఞాన సాగరాలు తరచిన వారు
మహాశిఖరాలుగా ఎదిగిన వారు

ఒకరు నృత్య కళా స్రష్ట
మరొకరు బహుభాషల యాది
ఇంకొకరు తెలుగు తల్లికి నుదుటి బొట్టు
ఇంకా ఒకరు చరిత గుర్తుల ఆనవాలు
ఆయనే చిత్రకళకు పల్లె వెలుగు
ఈయనా... బతుకు బొమ్మకు ప్రాణ ప్రభువు

అలసి ఆగిన అన్వేషణలు...
కలాలు కుంచెలకు వీడ్కోలు

ఆ కృషి తరతరాల చెరగని స్ఫూర్తి
కొత్త చరితకు నిత్య దీప్తి
జ్ఞానం చిరంజీవి

**మహామహులకు నివాళి**

బొమ్మలు : శివాజి, వెంకటేష్

# ఈ సంచికలో...



సంపాదకవర్గం
తెలకపల్లి రవి (సంపాదకుడు)
కె.ఆనందాచారి
వీరప్రసాద్
వల్లభాపురం జనార్దన

కె. లక్ష్మయ్య, మేనేజర్

చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : ssprasthanam@gmail.com
Prasthanam_ss@yahoo.co.in
www.prasthanam.com

## కథ

# యాత్ర

- భమిడిపాటి గౌరీశంకర్

సెల్ : 9492858395



చిన్నమ్మా !
వీళ్లమీద కోపగించుకోకు
వీళ్లనసహ్యించుకోకు
నిన్నెన్నెన్నో అన్నారు అవమానాల పాల్జేశారు
అవినీతి అంటగట్టారు
ఆడదానికి సాహసం పనికి రాదన్నారు.

- తిలక్

* * *

'వస్తానండీ ... ఇల్లు జాగ్రత్త .. ఏమిటో దిగులుగా ... దుఃఖం వస్తున్నట్టుగా ఉంది ...'

'ఎందుకు దిగులు ... అయినా తెల్లారేసరికి అక్కడ దిగుతావు .. అయినా అమ్మకాని అమ్మ కోసం .. అలా కోపంగా చూడకు ! నీవు కోపం ఉన్నప్పుడు నీ ముఖం ఎంత బాగుంటుందో తెలుసా? .. అమ్మయ్య .. నవ్వేవుకదా ! .. వేగంగా వచ్చేయ్ .. నేను చేతులు కాల్చుకోలేను ..'

రైలు బయలుదేరుతున్నట్లుగా కూత వేసింది ... దూరంగా గార్డు పచ్చజెండా ఊపాడు .. రైలు కదిలింది ..

'ఉంటాను .. సరూ' .. అంతను నా నుదుటిన చుంబించాడు .. పబ్లిక్ ప్లేస్ అనిపించలేదు .. అందరూ చూస్తారన్న బిడియం లేదు .. ఆ చుంబనంలో ఆర్ధ్రత .. దయ .. ధైర్యం ఉన్నాయి .. ఇంకేం లేదు..

రైలు వేగాన్ని అందుకుంది .. నా సీట్లో నేను కూర్చున్నాను. వాచీ చూసుకున్నాను.. ఆరున్నర .. శీతాకాలం రాత్రి భాగం చలిగా ఉంది .. షాల్ బయటకు తీసి భుజం పైన వేసుకున్నాను.

బ్యాగ్‌లో నుంచి బుచ్చిబాబు చివరకు మిగిలేది తీసాను నిజమే ... మనిషికి చివరకు మిగిలేదేమిటి ? ఈ ప్రశ్నకు సమాధానం తెలుసుకొనేంత వయస్సు అనుభవం నాకు లేదు...

పుస్తకంలో నుంచి ఉదయం నేనందుకున్న టెలిగ్రాం కాగితం నా మీద పడింది ... మదర్ సీరియస్ స్టార్ట్ ఇమ్మిడియట్లీ .. ఇదీ దాని సారాంశం.

మదర్ ... తల్లి ... అమ్మ ! ... ఎంత చక్కని పదాలు ...

"సృష్టించేను ఆ దేవుడు తనకుమారుగా" ... ఇంత చక్కగా కొద్దిపాటి పదాలలో మహాకవి చెప్పారు..

కిటికిలో నుంచి బయటకు చూసాను ... చల్లని గాలి రివ్వున వీస్తున్నది .. ధనుర్మాసపు వెన్నెల ఆహ్లాదకరంగా ఉంది .. రైలు వేగంగా పరుగెత్తుతుంది.. అప్పుడప్పుడు తన ఉనికిని చెబుతున్నట్లుగా కూత పెడుతూ ..

చెట్లు .. స్థంభాలు .. నదులు .. కాలువలు .. రహదార్లు ... వంతెనలు .. రకరకాల పట్టణాలు .. పల్లెలు .. అడవులు దూరంగా గబగబా వెనుకకు వెళ్లిపోతున్నాయి .. మనిషి జీవితంలో సంఘటనలు లాగానే ...

నా ఆలోచనలు వేగంగా గతం వైపుగా సాగిపోతున్నాయి..

మనిషి జీవితం చాలా చిత్రమైనది ... ఏయే సంఘటనలు ఎక్కడ మొదలవుతాయో, ఏయే స్నేహాలు, పరిచయాలు మన భవిష్యత్‌ను ఎలా నిర్ధేశిస్తాయో మనం చెప్పలేం ...

భవిష్యత్ ఒక పజిల్ .. అసలు మానవ జీవితమే పజిల్ ...

నా జీవితం కూడా అంతే .. నేను అమ్మ .. నాన్న .. పదిలంగా అల్లుకున్న పొదరిల్లు మాది .. కాని విధి బలీయం .. ఎవరి సంతోషాలతోనూ, దుఃఖాలతోనూ దానికి సంబంధం లేదు .. దాని పని అది చేసుకుపోతుంది ..

నాకు పది సంవత్సరాలప్పుడు మా అమ్మ ... చనిపోయింది .. నాన్న తాలూకాఫీసులో చిన్న గుమాస్తా .. ఆయన ఆఫీసుకు వెళ్లితే నేను వంటరిని ... అప్పటికి నాన్న వయస్సు కూడా తక్కువే! బంధువులు బలవంతం చేత .. నా సంరక్షణ కోసం .. నాన్న మరో స్త్రీని వివాహం చేసుకున్నాడు .. పిన్ని ఏనాడూ నన్ను ప్రేమగా చూసినట్టుగా నాకు జ్ఞాపకం లేదు ..



మరో ఐదు సంవత్సరాలు కాలగమనంలో కలసిపోయాయి .. నేను అతి కష్టం మీద బ్రతుకు బండిని లాగిస్తున్నాను .. ఒక విధంగా చెప్పాలంటే అందరూ ఉన్న అనాధలాగా నేను బ్రతికాను .. మా నాన్న ఉన్నంత సేపు నన్నెంతో ప్రేమగా చూసే పిన్ని ... నాన్న ఆఫీసుకు వెళ్లగానే నా మీద ధ్వజం ఎత్తేది .. అయితే నా అదృష్టం ఏమిటంటే .. నాన్న నా చదువు మాన్పించకపోవటం .. పిన్ని ఎంతగా పోరు పెట్టినప్పటికి ...

ఇదిగో .. సరిగ్గా ఈ సమయంలోనే అన్నపూర్ణమ్మగారు మా పక్కింటిలోకి వచ్చారు .. దబ్బపండు రంగు .. నిత్యంనెమలికన్ను .. గులాబి .. ఆకాశం రంగు, నారింజ రంగులు నీలి చీరలు మాత్రమే ధరించేవారు ...

కొంతమంది మనుష్యులను చూడగానే వీరు నా వారు అని భావం చటుక్కున మనకు స్ఫురిస్తుంది. ... ఎందుకంటే సమాధానం ఉండదు ..

కొన్ని కొన్ని ఫీలింగ్స్‌కి అర్థాలు చెప్పలేం ... అన్నపూర్ణమ్మ గారు నాకలానే అనిపించారు..

చాలా తక్కువ వ్యవధిలోనే నేనావిడ కూతురిగా స్థానాన్ని పొందాను..

నిజంగా నా విషయంలో ఆమె దేవత .. ఆమె నా అమ్మ .. నా దైవం .. నా గురువు .. నా హితైషి ... ఆమె లేకుంటే నా జీవితం ఈనాడు ... ఇంత ఆనందంగా ఉండేది కాదేమో !

అమ్మ ... అమ్మకాని అమ్మ .. గురించి లోకం ఎన్ని చెప్పింది నాకు .. ఆమె స్వయంగా చెప్పింది నాకు ..

'చూడమ్మా సరూ ! నా గురించి సమాజం ఎంత చెడ్డగా అనుకుంటున్నారో నాకు తెలుసు .. కాని నేను కాని పనేంచేయలేదు .. నాకు నచ్చినతనితో నా జీవితం పంచుకోవాలనుకున్నాను. అతనితో వచ్చేసాను .. దీనిని సమాజం లేచిపోవడం అన్నది .. సంప్రదాయం దాటిందన్నది .. మరొకటి మరొకటి అన్నది .. అయినా నేను సహించాను ఎందుకో తెలుసా ! నా జీవితం నాది సమస్యలు, కష్టాలు, దుఃఖాలు వచ్చినప్పుడే మన యొక్క దృఢచిత్తం తెలిసేది .. బాగా జరిగిపోతుంటే చిన్న పిల్లలు కూడా గొప్పవారి క్రిందే లెక్క నేను నీకు చెప్పేది ఒక్కటే నీవు బాగా చదువుకో! .. అవసరమైతే నా సహాయం కూడా నీకుంటాది .. నీవు నా కూతురువే ! ఆయన కూడా అదే అన్నారు .. ఎందుకో తెలియదు నిన్ను చూసిన దగ్గర నుంచి నా బిడ్డవే అనిపించింది .. అలాగే నిన్ను చూస్తున్నాం .. నీ పిన్ని ఎన్ని మాటలు అంటున్నారో నాకు తెలుసు ఒక్కటి మాత్రం గుర్తుంచుకో ! నీ జీవితాన్ని ఇతరులు శాసించకూడదు..'

ఆమె ఒడిలో నేను పడుకున్నాను.. ఆమెతో నేను ఆడుకున్నాను .. ఆమె నేను.. ఒక్కటే .. ఏనాడు మేము వేరు వేరు అనుకోలేదు ...

ఆమె మాట నాకు వేదం .. నా దుఃఖం, బాధ ఆమెకు కష్టం .. నాన్న, అమ్మ, సోదరి, సోదరుడు, ఉపాధ్యాయుడు అన్నీ .. నాకు ఆమె ..

రెండు సంవత్సరాలు గడిచాయి .. నేను ఇంటర్ పూర్తి చేసి ... టీచరు ట్రైనింగ్ కోసం భీమిలి వెళ్లాను..

ఆమెను వదిలి వెళుతున్నప్పుడు ఆమె .. నా తల్లి .. నా చేతికొక ఉత్తరం ఇచ్చింది .. నా గురించి నేను నీకు చాలా తక్కువగా చెప్పాను. నీవు తెలుసుకోవలసింది చాలా ఉంది .. నేను లేకపోయినా నా చేతిలో పెరిగిన బిడ్డగా సమాజం నా నీడ నుంచి నిన్ను చూస్తుంది .. కనుక ఇది చదువుకో .. ఇదిగో ఉంచు ఖర్చుకి .. మళ్లీ కలుద్దాం .. ఆఁ! చెప్పడం మరచాను మేము ఈ ఊరు వదిలి బహుశా వచ్చే నెలలో వెళ్లిపోవచ్చు .. సంఘం మనిషిని బాధించడంలో పొందిన ఆనందం ఏమిటో నా విషయంలో స్వయంగా తెలుసుకున్నాను వెళ్లు .. ఆనందంగా వెళ్లు...

ఆమె పాదాలకి మ్రొక్కి .. మా నాన్న వద్ద ఆశీస్సులు పొంది .. బయలుదేరాను ..

దారిలో .. ఆమె నాకిచ్చిన ఉత్తరం చదవసాగాను.

మా నాన్న ఓ మధ్య తరగతి కుటుంబీకుడు .. భయం ఆయన నేస్తం. పేదరికం ఆయన ఆస్తి నేను .. అమ్మ .. తమ్ముడు .. నాన్న .. ఈ చిన్న సంసారమే మాది ..

మా నాన్న ఓ ఆసామి దగ్గర భూమిని కౌలుకు తీసుకున్నాడు. ఓ రెండెకరాలు .. దాని మీద ఆదాయం బొటాబొటిగా సరిపొయ్యేది .. నేను పెద్ద దాన్ని ఆయిన దగ్గర నుంచి నా పెళ్లి ఓ సమస్య అయిందాయనకు మా తమ్ముడు చదువు సహితం ఈ కారణంగా ఆగిపోయింది .. ఈ విషయాలన్ని నన్ను బాధించాయి.. కాని

# ఆగష్టు నెల పురస్కారాలు





| వర్షించిన మానవత్వం | స్పాన్సర్ ఖడ్గం |
|---|---|
| కథకు........రూ.700/- | కవితకు.......రూ.500/- |
| రచయిత : సింహాద్రి నాగశిరీష | రచయిత : ఐనంపూడి శ్రీలక్ష్మి |

**సినీ రచయిత జనార్ధన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.**

మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

- ఎడిటర్

---

ఆడపిల్లను ఏం చేయగలను .. కాని తప్పదు ఏదో ఒకటి చేయాలి ఇదిగో .. ఇటువంటి సమయంలోనే మా ఇంటి ప్రక్కనే ఉన్న ఓ అబ్బాయితో నాకు స్నేహం పెరిగింది .. స్నేహం ప్రేమగా మారింది .. మా కులాలు వేరు .. కాని మనస్సులు కలిసాయి .. మేం వివాహం చేసుకుందామనుకున్నాము.

పర్యవసానం లేచిపోయాం, ఒక విషయం నీకు చెప్పాలి. మనిషిని సమాజం కొంత కాలం మాత్రమే శాసిస్తుంది. ఎదురు తిరిగితే వెంట ఉంటుంది. కాని మన ప్రత్యక్షంలో కాక పరోక్షంగా మనలను దుఃఖానికి గురిచేస్తుంది .. స్త్రీలకు ఎందుకు స్వేచ్ఛ నివ్వరు అని వాదించే చాలామంది స్త్రీలు కూడా తమ స్త్రీలను బందీలుగానే ఉంచుతారు.. తమకు సమాన హక్కులు కావాలనుకొనే కొందరు స్త్రీలు గూడా పురుషుల కోసం, వివాహం కోసం తహతహ లాడటం నాకు తెలుసు .. ఈ మనుషులలోని డొల్లతనంను కప్పుకోవటం కోసం నిందలను ఎదుటి వారి మీద వేస్తారు .. బాధిస్తారు .. దుఃఖానికి గురిచేస్తారు .. సమాజం ఓ కత్తుల బోను .. మనకు సర్కసు తెలిసుంటే ఎన్ని సాహసాలైనా చేయవచ్చు .. లేదంటే మాత్రం పతనం తప్పదు .. గుర్తుంచుకో మనం మన కోసం .. మన కర్తవ్యం కోసం బ్రతకాలి .. మార్పును వేగంగా జీర్ణించుకోలేదీ సమాజం. చదువు కావాలి .. ఆర్థిక స్వతంత్రం కావాలి .. నా భర్త దేముడు, పోలీసయినా నీతిగా బ్రతికారు .. అందరికి అలాంటి వారు లభించరు .. నా బాల్యం, యవ్వనం .. జీవితం .. వీటి గురించి ఈ చిన్న స్థలంలో .. సమయంలో కుదించలేను .. నీవు తెలుసుకో .. మరచిపోకు పోరాటం చేయి .. తాత్కాలిక అపజయాలు కలుగవచ్చు .. క్రుంగిపోకు .. ముందుకు సాగిపో .. విజయం నీదే ..'

సదా నీ అభివృద్ధిని ఆకాంక్షించే అన్నపూర్ణమ్మ

నాకేదో చెప్పలేని ధైర్యం వచ్చింది .. ఇక నన్నేశక్తి ఈ లోకంలో ఆపలేదనిపించింది .. కష్టపడ్డాను .. ఉపాధ్యాయ శిక్షణ తరువాత పి.జి. వరకు చదివాను .. ఇప్పుడు ఇదిగో .. విశాఖలో ఉద్యోగం .. మా అమ్మలా నాది కూడ ప్రేమ వివాహమే .. అతను నన్ను అర్థం చేసుకున్నారు .. అందుకే .. ఆనందం .. అవును ఈ జీవితం నాది. "అమ్మాయి టేసను వచ్చేసినాది" .. ప్రక్క సీటావిడ హెచ్చరికలో ఈ లోకంలోకి వచ్చాను .. ఏవో ఆలోచనల మధ్య సుమారు పదమూడు గంటల ప్రయాణం గడిచిపోయింది ...

గబగబా ఆటో ఎక్కి .. అమ్మ ఇంటికి చేరుకున్నాను ..

"రండి .. రండి .. మీ కోసమే ఎదురుచూస్తున్నాం .. ఆమెకు ఎవరున్నారు .. మీ గురించే చెబుతుండేవారు .. భర్త నక్సలైట్లు చేతిలో చనిపోయి సంవత్సరం గడిచింది .. మీకు అదేదో డాక్టరేట్ బిరుదు వచ్చినప్పుడు మీ అడ్రసు తెలుసుకొని తన డైరీలో వ్రాసుకుంది .. దానితోనే మీకు టెలిగ్రాం ఇచ్చాం .. రండి .. చేయవలసిన పనులు చాలా ఉన్నాయి .."

తతంగం గబగబా ముగించాను .. ఏడుపురావటం లేదు .. మనసు నిండా బాధ .. ఒక యంత్రంలా చేసుకుపోతున్నాను .. అన్ని పనులను ..

కాడికి ముందు నిప్పు కుండతో నేను .. చిత్రం ఇటువంటి సందర్భమొకటి నా జీవితంలో వస్తుందని నేననుకోలేదు .. అనుకోని సంఘటనల సమాహారమే జీవితం ..

చితికి నిప్పంటించాను .. మౌనంగా రోదిస్తూ – ఏదో వెలితి .. శూన్యం .. నాకెవరు లేరనే భావన .. మెటాఫిజికల్ ఎమ్టీనెస్ ..

చితి మండుతున్నది .. వేగంగా ఎప్పుడో నేను చదువుకున్న శేషేంద్రశర్మగారి కవిత గుర్తుకు వచ్చింది ..

"ఓ తల్లి ! ఒకప్పుడు
గగనంలో నక్షత్రాలు చూచే నీ కళ్లు
నిష్క్రమించడం చూచాయి ఈ కళ్లు
నీ విప్పుడు జీవితం చెక్కిన మౌన మూర్తివి
బాలిక నుంచి భార్య వరకు ఒక యాత్రవి"

ఆమె యాత్ర ముగిసింది .. చితి మీద .. మంటల మధ్య ... ♦

## మట్టిరంగు

డా. ఎన్. గోపి

మట్టికి నిద్రరాదు
ఇప్పుడే కాదు
అనవరత నిర్నిద్రాచలిత ముద్రిత మట్టి
ఒంటినిండా జీవకణాలు కదుల్తుంటే
కళ్లుమూసుకొని
కొత్త సృష్టిని అనుభూతి చెందుతుంది

నిద్రరాకున్నా
భూమికలలు కంటుందనడానికి
ఈ పువ్వులే సాక్ష్యం

మట్టి ఉలిక్కిపడుతుందా అంటే
అవును
భూకంపమే దాని ఆగ్రహం



ఆకాశం ఆశగా నవ్వితే
దానికి ఇంద్రధనుస్సు కండువా కప్పుతుంది
ఏ రంగు ఇష్టమని అడిగితే
తెల్లబోయి చూస్తుంది

మట్టి పొరల నిండా
చీకటే అయినా
బంగారంగా మారే
రసవిద్య దాని సొంతం
బంతిని గోడకు కొడితే
ఎదురుతంతుంది
మట్టి అట్లాకాదు
మహోద్ధృత మమకారంతో
అక్కున జేర్చుకుంటుంది

---

## కొత్తగా మొలకెత్తాలి

ఎస్.ఎస్.బి. గేరా
9492922492

జీతానికీ, జీవితానికీ పద్ద పీటముడితో
జీవికతో రాజీపడిపోయి
పాతికపైచిలుకు సంవత్సరాల పాటు
గానుగెద్దు ఉద్యోగంలో
గంగిరెద్దులా బతుకీడ్చిన
సగటు ఉద్యోగి మిత్రమా,
పదవీ విరమణ-
నీకు మరణ సూచిక కాదు
చరమాంకపు చిరుదీపిక!
పదోన్నతులకోసం పడిగాపులు కాసీకాసీ
కరువుభత్యాలకై ఎదురుచూసీచూసీ
బహూశా నువ్వెవరో-
మర్చిపోయే ఉంటావు!
నువ్వేంటో -
నీకే గుర్తుండక పోవచ్చు!
పదవీ విరమణతో,
ఆ ప్యూపాదశను పెకిలించుకొన్న
సీతాకోక చిలుకవైపో!
పూడిపోయిన అభిలాషల్ని, అభిరుచుల్ని
పెళ్ళగించి పైకితీయ్!
మిణుగురుల్లాంటి కళాకాంతుల్ని పోగేసి
పొద్దుపొడుపులా పొడుచుకురా!



ఇంకిపోయిన సేవాతత్పరతను తొవ్వితీసి
నిస్సహాయ క్షేత్రాల్లోకి పారించు!
చెదిరిపోయిన నీ చిన్ని చిన్నికలలతో
కళ్ళముందు రంగవల్లికలల్లుకో!
మిత్రమా,
కొంచమైపోయే జీతమే పింఛను!
దాన్నంతా,
విరమణానంతర వైద్యానికేగాక
మధుర క్షణాల మహోత్సవాలకూ
ఖర్చుచేయాలంటే మాత్రం
నువ్వు-
మళ్ళీ కొత్తగా మొలకెత్తాల్సిందే!!

---

## నా మాట

మండవ సుబ్బారావు

కమ్మనైన తెలుగు మాట
తేనె లొలుకు తెలుగు పాట
వినిపించదు ఏ నోట
ఓ సుబ్బారావు!

బడులనెడి సంతలోన
చదువు ఒక సరుకు
అంతరిక్షమున దొరుకు
ఓ సుబ్బారావు!

వెలుగు జూపే పత్రిక
రాహువు మ్రింగిన చంద్రిక
కానరాదు మనకిక
ఓ సుబ్బారావు!

పగలంతా ఉక్కపోత
గంటల తరబడి కరెంటు కోత
బిల్లులేమో మోత
ఓ సుబ్బారావు!

అంతులేని గనులు
దోసుకొంటిరి ఘనులు
మేలుకోరు జనులు
ఓ సుబ్బారావు!

# తిలక్ ఆధునిక మార్గం అపురూప వైభవం



డా॥ ఆవంత్స సోమసుందర్

ఆధునిక కవులలో విశిష్టుడు. అతని అభివ్యక్తి, అతని కృషి ఫలితంగా అతని కవిత్వం సదా తాజాగా కనిపిస్తుంది.. ప్రతీఒక్క కవిత కూడాను ఎంతో అర్ధవంతంగా భాసిస్తుంది. ఏ ఒక్క రచనా అలవోకగా కాని ఆషామాషిగా కానీ రచించిన వైఖరి కనిపించదు. వక్రోక్తి పాదుకొల్పడంలో అతనికతనే సాటి. అతిలోకమైన కవితా రమణీయకతతో అనుమేళనం చేస్తాడు. తద్వారానే అతని కవితా సృష్టిలో ఒక పుష్టితో పాదుకొని రసమయ సౌందర్యం సాధిస్తాడు. పద్య ఛందస్సులలో సైతం నిత్యం అతని శైలి ప్రత్యేకమైన సౌందర్యాన్ని సాధించుకొంది. నిరంతరం పద్యాలు రాసి పద్యచ్ఛందస్సులలో తప్పా మనోజ్ఞమైన పద్యాలు రాయకూడదనే వారి పద్యాల కన్నా ఎంతో సౌందర్యంతో తిలక్ పద్యాలు భాసిస్తాయి. నాలుగు పాదాలు రాసినా కవి దర్శనం. సర్వత్రా పాటిస్తాడు. తెలుగు కావ్య గ్రంథం తిలక్ పరిమళభరితం చేశాడు. అతను కావ్యధారను నింపి సౌందర్యభరితం చేశాడు. భావ కవిత్వ రంగానికి కొసమెరిపు దిద్దాడు. భావ కవితా లక్షణాలు అతివేగంగా ప్రదర్శించిన ప్రభాతము సంధ్యా అనే గ్రంథంలో ప్రచురితం అయ్యాయి. తిలక్ తొందరగా సాగిపోతూ ఎన్నో ఉదాహరణాత్మక కవితలు ప్రసాదించినా ప్రతి కవితకు ఒక సమగ్ర మూర్తిమంతనం కల్పించాడు. పూర్వ సాహిత్యంలో వేలాది పద్యాలు ప్రతిరూపాలు సృష్టిస్తూ సాగిపోయేవారు ఎందరో మహాకవులు అనిపించుకున్నారు.

ఈషణ్మాత్ర నవ్యతను సాధించుకుండానే మహాకవులు అనిపించుకున్నారు. కవితాభివ్యక్తిలోనే మౌలిక విభేధం. సాధించకుండానే అందలాలకు ఎక్కినవారు ఎందరో.

శ్రీనాధుడు మహాకవి పల్నాటి వీర చరిత్ర రచించిన ద్విపద కావ్యంలో సైతం ఎన్నో అభినవ అభివ్యక్తులతో భాసింపచేశాడు. పోతన భాగవతంలో నవీన తేజస్సు చేకూర్చాడు. విశిష్ట కవితా శక్తి పాదుకొల్పకపోతే ఏ కవిత్వానికి కావ్య శక్తి లభించదు. ఈ ధర్మసూక్ష్మం ఎరిగి తిలక్ ఏ కావ్యాన్నైనా సబుద్ధి వికాసంతో శిల్పమయం చేశాడు.

1942 నాటి తిలక్ ప్రారంభ దశకు 1962 నాటి మరణాంతర దశకు నడుమ సాగిన అంతరాలు పరిణామాలు జాగరూకతతో విమర్శకులు పరిశీలించవలసి వుంది. తిలక్ చివర ఊపిరి తీసుకున్న 1961 నాటికి ఇతని కవితా రంగం అపార విస్తృత వైభవంతో తనరారుతుంది.

ఎన్నో సంవిధాన రీతులను అనన్య సామాన్యంగా ప్రయోగించాడు. కవిత్వంలో సాధించిన తన విశిష్టత సమకాలీన కవితా శ్రేణికి ఎంతో అమేయ అంతరాన్ని సాధించింది. ఏ వాక్యం చూసినా "ఇది తిలక్ వాణి" అని స్పష్టంగా చదువరి హృదయంలో మ్రోగుతూ వుంటుంది. తెలుగు కవిత్వ చరిత్రలో తిలక్ అందుకున్న స్థానం "అమృత వర్షిణి"లో లోగడ వివరించాను. కవిగా అతని యాత్ర నిరంతర అన్వేషణాశీలమైనది ప్రతీ కవితా ప్రత్యక్ష నవీనతను సాధించింది. ఈ విషయాలనే సాహిత్య చరిత్రకారులు స్థాపించడంలో పొరపాటు (లేదు) పడలేదు.

అనల్పమైన భావనలను అతిలోక నవీన కల్పనలను (ఇమాజినరీ అండ్ ఇమాజెస్) అల్పాక్షరాలలో బంధించి ఎంతో సుహృత్ వాఖ్యకు ఎంతో వాఖ్యానానికి అవకాశం ఇవ్వడం ఉత్తమ కవితా సాంద్రతర రీతికి ప్రాణం. అదే తిలక్ సాధించాడు. అతనివి విప్లవ భావాలు కాని, మానవీయతానుభూతులతో సమ్మేళనమైన పరిమళమందుకుంటాయి. కారుణ్యాత్మకమైన ఆర్తగీతం కాని చిత్రాలను అందరికీ పరిచయ పూర్వాంశాలుగా సార్వత్రిక ప్రతిబింబాలుగా నెలకొల్పాడు.



# అందరూ ఉన్న అనాధలు

జంధ్యాల రఘుబాబు
9849753298

బాబూ
ఎవరో చిన్న పాప
గొంతులో రొట్టెముక్క ఇరుక్కుని
ఊపిరాగిన సంఘటన
మాకు నిద్రను దూరం చేసిందిరా

నాయనమ్మ తాతయ్యలు బతికుండగానే
పిల్లలు క్రచ్‌లో ఉండడం దేనికిరా
చిన్నది బడికెళ్లే వరకూ
దాన్ని జాగ్రత్తగా మేము చూసుకుంటాం రా
ఈ వృద్ధాశ్రమంలో వద్దనుకుంటే
మీ ఇంట్లోనే పక్క రూములో ఉంటాము
ఈ సాకుతో మళ్ళీ మీ ఇంట్లో అడుగు
పెడదామని కాదు
మీ నాన్న వద్దన్నా
నాలో ఇంకా ఎండిపోని మమకారం
నన్నీ మాట అడిగేలా చేసిందిరా

మేమిద్దరమే చిన్న దాన్ని చూసుకోవాలన్న
ఆశ కాదురా
మీ అత్తమామల్లైనా దగ్గర పెట్టుకొమ్మని
కోడలుపిల్లకు చెప్పరా

ఈ వయసులో మనుషులకు దూరంగా ఉండటం
అలవాటయింది కాని
మనసులోని అనుబంధాలకు
తెర దించలేక పోతున్నాము
నీవు అన్నింటిలోనూ ముందుండాలని
నిన్ను పెంచిన తీరే
అందరికంటే ముందుగా
మమ్మల్నిక్కడ చేర్చింది

మీ మీ ఉద్యోగాల్లో ఎదుగుతూనే
జీవితాన్ని జీవించండిరా

మనవలు ఉండి లేనివాళ్ళ మయ్యాం
బిక్కు బిక్కుమని చూసే వారి చూపులు
మా కనురెప్పల్ని మూయనివ్వటం లేదు

మా స్థితికి మేము కుంగిపోవాలో
వారి గతికి కలత చెందాలో
ఇలా అందరూ ఉన్న అనాధల్లా
ఎవరికొరకు బతుకుతున్నామో
కాలమే సమాధానం చెప్పాలి!

---

ఇంత విశాలమైన భూభాగంలో ఇంత అనిర్వచనీయమైన మానవ జీవితం ప్రస్తుతానికి అందించిన సర్వక్లేశాలను సకల సౌందర్యాలను కవిగా తాను వారసత్వం స్వీకరించారు. ఈ భూమిపై బ్రతుకు చిరతర వాంఛనీయమే కాని మనిషి బ్రతుకు చుట్టూ ఇనుప గొలుసులే. వీటిని తొలగించుకోకపోతే, ఈ బాధా పరంపరను పరిష్కరించుకోకపోతే మానవ జీవితం వాటి నడుమ అంతరించిపోతుంది అనే భయం కవికి తప్పకుండా ఉండాల్సిందే. రేపు జరగబోయే విపత్తును నేడే దర్శించగల ఉత్తమ ద్రష్టగా కవి జాగరూకుడు కావాలి. మేధావిగా దర్శించి, తన భావయిత్రిని మేళవించి కారయిత్రిని సాధించిన అతని అక్షరం రూపొందగలదు.

అతని కవిత మనకు విశ్వసనీయంగా వాగ్దానం ఇచ్చింది. లోక వాస్తవికతలను ఉన్నవి ఉన్నట్లుగా కాగితాలకు ఎక్కించడం. కవి ధర్మం కాదు.

భావనామయ కాల్పనిక వాస్తవికతను (ఎమోషనల్ ఇమేజినేటివ్ రియాలిటీ)ని చిత్రించడమే కవి బాధ్యత. ఈ సారాంశాన్ని తిలక్ కవితా శక్తి వ్యక్తంగానూ, అనభివ్యక్తంగాను ఉద్ఘాటిస్తూనే వచ్చింది.

అనేకానేక కవితామయ భావాలతో అతలాకుతలమైపోతున్న వర్తమానం ఛాయాసదృశ్యమైన వక్రరేఖలను దర్శనీయం చేస్తుంది. అమానుష చర్యలను వీర కృత్యాలను గొప్పగా ప్రదర్శించుకుంటుంది. ఈ విషమస్థితి అతి వ్యాప్తమై తెలుగు కవితా రంగానికి సైతం తన వికార ముఖకవళికలను ప్రవేశపెడుతుంది. ఇట్టి విషమ స్థితిలో సంకీర్ణతలలో తిలక్ కవిగా ఒక మలయమారుతంగా మాధురీధురీతంగా, ప్రసరించింది. తిలక్ అక్షరమార్గం కవిత్వాన్ని ఒక అపురూప కళగా భాసింపచేసింది. ఆ సారాంశాలను పరిగ్రహించడమే తిలక్ అనుజన్ముల భద్రతామార్గం. వివాద లోకపు ఆక్రోశాల ఒదిగిన నినాదాలు కవిత్వాన్ని దురాక్రమణం చేయనందుకు అతని హృదయం క్షంతవ్యం అవుతుంది. అందుకు తిలక్ కవితలను పునరుశ్చరణ యోగ్యమైనవిగా సహృదయులు స్వీకరిస్తారు. మనోమయ కోశంలో చిరంతన సువర్ణకాంతులు వెలార్చగలదు.

కవిత్వం ఏదైనా అది అధ్యయనం చేస్తున్నప్పుడు పాఠక హృదయంలో ఎంత రసమయ తేజస్సు ప్రోది చేస్తుందో? కాని అనుభవ సంస్కరణలను పాఠకుని హృదయం తత్ కవిత్వ భావనాలోకాన్ని దర్శించుకొని రసమయమవుతుంది.

రచయిత సెల్ : 9347848905

# కన్యాశుల్కంలో బైరాగి పాత్ర

ఓల్గా




*వర్తమాన సమాజాన్ని అర్థం చేసుకోటానికే సమయం లేనంత వేగంగా కాలం నడిచిపోతుంటే 100 ఏళ్ళ క్రితం సమాజాన్ని పనిగట్టుకుని ఎందుకు అర్థం చేసుకోవాలి? పోనీ అర్థం చేసుకుని ఏం చేయాలి? అనే ప్రశ్నలు కొత్తతరం పాఠకులకు రావటం సహజం. ఐతే మన గతం మన వర్తమానాన్ని నిర్దేశిస్తుంది. అందులోనూ గతాన్ని పూర్తిగా నిర్మూలించకుండా ఆ పునాదుల మీద అస్తవ్యస్తంగా నిర్మించబడ్డ సమాజాన్ని అర్థం చేసుకోవాలంటే గతాన్ని అర్థం చేసుకోవటం అవసరం.*

కన్యాశుల్కం నాటకం ఆనాటి సమాజంలోని ఆ ఒక్క దురాచారాన్ని ఉద్దేశించి రాసినది కాదని ఇవాళ ఎవరూ ఎవరికీ కొత్తగా చెప్పనక్కర్లేదు. అది ఆనాటి సమాజం మీద ఒక సమగ్రమైన కఠినమైన విమర్శ. ఆ విమర్శ లోతుల్లోకి వెళ్ళి చూసి అప్పటి సమాజాన్ని అర్థం చేసుకోవటమే మనం చేయవలసినది. 100 సంవత్సరాల క్రితం సమాజాన్ని అర్థం చేసుకోవటమెందుకు? ఆ సమాజం ఎలా ఉంటే మనకేమిటి? వర్తమాన సమాజాన్ని అర్థం చేసుకోటానికే సమయం లేనంత వేగంగా కాలం నడిచిపోతుంటే 100 ఏళ్ళ క్రితం సమాజాన్ని పనిగట్టుకుని ఎందుకు అర్థం చేసుకోవాలి? పోనీ అర్థం చేసుకుని ఏం చేయాలి? అనే ప్రశ్నలు కొత్తతరం పాఠకులకు రావటం సహజం. ఐతే మన గతం మన వర్తమానాన్ని నిర్దేశిస్తుంది. అందులోనూ గతాన్ని పూర్తిగా నిర్మూలించకుండా ఆ పునాదుల మీద అస్తవ్యస్తంగా నిర్మించబడ్డ సమాజాన్ని అర్థం చేసుకోవాలంటే గతాన్ని అర్థం చేసుకోవటం అవసరం. వంద సంవత్సరాల క్రితపు వలసపాలనలో మన దేశానికి పడిన పునాదులు అలాగే ఉన్నాయి. గతం వేర్లు బలంగా ఉన్నాయి. ఊడలు దిగి ఉన్నాయి. ఆ ఊడలను కొత్త లతలు అల్లుకుని ఆ వృక్షపు రూపం మారినట్లు కనిపించవచ్చు గాక, కానీ బలమైన ఆ వేర్లను, ఊడలను చూడలేకపోతే మనకు వర్తమాన సమాజం అర్థం కాదు. ఆ గతం వేర్లను అర్థం చేసుకోవటానికి కన్యాశుల్కం నాటకంలో చేసిన సామాజిక విమర్శను మనం లోతుల్లోకి వెళ్ళి చూడాలి.

కన్యాశుల్కం నాటకం ఒకటి రెండుసార్లు మనసు పెట్టి చదివిన వాళ్ళకు అది రోజూ గుర్తొస్తూనే ఉంటుంది. కొత్త సందర్భాలు మరీ అంత కొత్తవి కావని తెలిసి ఆశ్చర్యం కలుగుతుంది. ఇప్పుడు చాలా పెద్ద స్థాయిలో జరుగుతున్న అనేక సామాజిక, రాజకీయ విషయాలు 'కన్యాశుల్కం' నాటకంలో గురజాడ ఏదో ఒకచోట చెప్పినవే అని తెలిసి మహా కవి దూరదృష్టికి ఆశ్చర్యపోతుంటాం. ఈ మధ్య వార్తపత్రికలలో అత్యున్నత స్థాయి పోలీసాఫీసర్లు ఇద్దరు ఒకరిపై ఒకరు వైరం పెంచుకుని ఒకరి మీద ఒకరు క్షుద్ర పూజలు చేయించారనే వార్త చదివినపుడు కన్యాశుల్కం నాటకంలో 'హెడ్' పాత్ర, హెడ్, ఇన్‌స్పెక్టర్ల వైరం, హెడ్ పక్షం వహించి ఇన్‌స్పెక్టర్‌కి వాగ్బంధం చేస్తానన్న బైరాగి పాత్ర గుర్తొచ్చాయి. అప్పటి వరకూ కన్యాశుల్కం నాటకంలో సారాయి దుకాణం సన్నివేశం, అందులో బైరాగి పాత్ర అంత అవసరమా అనిపించేది. ఆ రంగం లేకపోయినా నాటకానికి లోటు లేదు గదా ఎందుకీ రంగం? ఏమిటి దీని ప్రత్యేకత అనే ఆలోచన వేధిస్తుండేది. రావప్పంతులు లుబ్ధావధాన్లను బెదిరించటానికి హెడ్ సహాయం కోరటానికి సారాదుకాణానికే వెళ్ళనక్కర్లేదు. వాళ్ళిద్దరూ ఎక్కడైనా కలవొచ్చు. ఐతే ఈ వర్తమాన పోలీసుల వార్తలు చదివిన తర్వాత కన్యాశుల్కంలో సారా దుకాణం సన్నివేశం ఒకటికి రెండుసార్లు చదివితే అది చాలా కీలకమైన సన్నివేశమేనని అనిపించింది.

సారా దుకాణం దగ్గర సమావేశమైన పాత్రలు మతం, రాజ్యం, పాలనా విభాగం, మిలటరీ, వ్యాపారం వీటన్నిటికీ ప్రాతినిధ్యం వహించేవి. మునసబు, హెడ్, హవల్దారు, బైరాగి, యోగిని సారాదుకాణం యజమాని రామందాసు, సాతాని మనవాళ్ళయ్య, జంగవీరేశం ఇలా అనేకమంది ఉంటారు. అందరూ సారా తాగుతూ భూమ్యాకాశాల గురించి చర్చకు దిగుతారు. ఆకాశం శూన్యమని కొందరు, భూమికి ఆకాశం కప్పా? ఆకాశానికి భూమి గచ్చా అని. కొందరూ చర్చ చేస్తుంటారు. ఆకాశంలో ఏమీ లేకపోతే తెల్లోడు ఊరికే యంత్రాలు పెట్టి ఆకాశం కేసి ఎందుకు చూస్తాడనే ఆలోచన చేస్తారు. బైరాగి తను ఆకాశ మార్గాన హరిద్వారం కాశీ వచ్చిన విధం, ఇక్కడ ఆగిన కారణం, రామేశ్వరం వెళ్తున్న వివరం అన్నీ చెప్తుంటాడు. ఎవరూ దానిమీద సందేహం వెలిబుచ్చరు. బైరాగి ఆ ఊళ్ళో ఆగిన కారణం ఆ ఊరి అమ్మవారు. ఆమెను పూజిద్దామని ఆగుతాడు. సారా దుకాణం దగ్గర రామభక్తులు, శివభక్తులు, కాళీభక్తులు ఉన్నారు.

వీరందరి మధ్యా గ్రామ దేవత కూడా ఉంది. అసిరి పూజించే

పైడితల్లి ఈ అమ్మవారే అయి ఉండవచ్చు. బైరాగి చెప్పే ఆకాశగమనం మీద ఎవరికీ సందేహం రాదు. అందరూ నమ్మారని కాదు. సారాదుకాణం రామందాసు నమ్మే అవకాశం లేదు. ఐనా బైరాగి మహాత్యాలను అతడు ఖండించాడు. అతని వ్యాపారానికి అది అవసరం. హెడ్‌కి బైరాగి మీద పూర్తి నమ్మకం. చాలా ఎడ్మిరేషన్. ఆ ఎడ్మిరేషన్‌తో "ఆహా – యోగ మహత్యం. స్తానాల్చేసి ముక్కు బిగించే బ్రాహ్మలకి లేవు గదా ఈ సిద్ధులు" అని బ్రాహ్మలకన్నా బైరాగిని గొప్ప చేస్తాడు. బ్రాహ్మల విషయంలో హవల్దారుది, హెడ్‌ది భిన్నాభిప్రాయం హెడ్" యీ రోజుల్లో బ్రాహ్మణ్యం మెక్కడుంది? యెక్కడ చూసినా పిల్లల్ని ముసలాళ్ళకి అమ్ముకోడాలు – రండా గర్భాలే కదా!" అంటే హవల్దారు ఒప్పుకోడు" మెంతచెడ్డా బ్రాహ్మలు మనకి పూజ్యులు" అంటాడు. లుబ్ధావధాన్ల గురించి రావప్పంతులు గురించి మునసబు విమర్శిస్తే కూడా హవల్దారు ఊరుకోడు. "మనకేల మావాఁ? గవుర్‌మెంటు దేవుళ్ళూ, బ్రాహ్మలూ వారి నేరాలు వారివి. వాటికి మనతో పని లేదు. మన భక్తి మనకుండాలి". అని మూడు ప్రధాన వ్యవస్థలైన రాజ్యం, మతం, పితృస్వామ్యాలని పట్టించుకోవద్దంటాడు హవల్దారు. బ్రాహ్మలు పితృస్వామ్యానికి ప్రతినిధులని ఎందుకంటున్నానంటే నీతి అవినీతుల గురించి, ఆచారాల గురించి, అధికార దొంతరల గురించి రాసేది, చెప్పేది, తీర్పు లిచ్చేది వారే గనుక. ఈ మూడు వ్యవస్థలనీ పట్టించుకోకుండా మనం బతికెయ్యాలని మిలటరీ హవల్దార్ అభిప్రాయం. హవల్దారు ఇంకోమాట కూడా అంటాడు. రకరకాలదేశాలు, ఆచార వ్యవహారాలు చూశాను కానీ నీతి దేవుడు, మాకు ఒకటే అంటాడు. నీతి పితృస్వామ్యాన్ని, పితృస్వామ్యం నీతిని నిలబెడుతుంది. దేవుడు మతం రూపు దాలుస్తాడు. ఈ రెండిటినీ రక్షించేది రాజ్యం. "వాటి నేరాలు వారివి. వాటితో మనకి పనిలేదు" అని మిలటరీ వాడు సామాన్య జనంతో చెప్పటం. ఇంత గంభీరమైన విషయాన్ని చాలా మామూలు సారా దుకాణపు హాస్యంలాగా ఎలా చెప్పాడా గురజాడ అని ఆశ్చర్యం వేస్తుంది. మతం, రాజ్యం పితృస్వామ్యం కలిసి నేరాలు చేస్తున్నా, అవి ప్రత్యక్షంగా భూతద్దంలో మనకు కనిపిస్తున్నా పట్టించుకోని తనం మనకిప్పుడు ఏ హవల్దారూ చెప్పకుండానే ఎలా అలవాటైంది? లేదా కనిపించని మిలటరీ హవల్దారు ఒకడు ఈ మాటలు మన మనసులకు సారా పోసి మత్తెకించినట్లు ఎక్కిస్తున్నాడా? మళ్ళీ లుబ్ధావధాన్లు కూతురు మీనాక్షికి (వితంతువు) పెళ్ళి చెయ్యొచ్చనే అభిప్రాయం బలపరుస్తూ మునసబు "మన్లో మారు మనువు లుండేవి కావా?" అంటాడు. బహుళ సంస్కృతులతో, వైవిధ్యం ఉన్న జీవన విధానాలతో ఉన్న దేశాన్ని వలసపాలన బ్రాహ్మణీయ ఏక సంస్కృతిలోకి ఎలా నెట్టింది – బ్రాహ్మణీయ ఆచారాలు, నీతులు ఎలా స్థిరపడుతున్నాయి. వీటి గురించి ఆలోచింపచేస్తుంది మునసబు అన్న ఆ మాట.



ఈ మాటలన్నీ ఇలా జరుగుతున్నపుడు రావప్పంతులు వచ్చి హెడ్‌ని లుబ్ధావధాన్లను బెదిరించటానికి రమ్మంటాడు. లుబ్ధావధాన్లమీద ఖూనీకేసు బనాయించాలంటాడు. సాక్ష్యానికి బైరాగి కూడా వెళ్తాడు. లుబ్ధావధాన్లని బెదిరించి తలా మూడు రూపాయలు సంపాదించుకుంటారు. ఆ తర్వాత రామచంద్రపుర అగ్రహారం నుంచి బైరాగి విశాఖపట్నం వస్తాడు. కాశీ నుంచి ఆకాశగమనంలో వచ్చాననే పాతకథని కొత్త జనంతో చెప్తుండగా సారా దుకాణం యజమాని రామందాసు కనపడతాడు. మొదటి నుంచీ బైరాగి వ్యవహారం అతడొక్కడికే సరిగ్గా తెలుసు. అతనిది వ్యాపారం. వ్యాపారంలో మహత్యాలకు చోటు లేదు. తాగిన సారాకు డబ్బు కట్టని బైరాగికి ఎన్ని దివ్యశక్తులున్నా సారా కొట్టు వాడికి అనవసరం. తన బాకీ రూపాయలు కక్కి కదలమంటాడు. "మమ్మల్ని పోలిన దాసరి వాడొకడు బైరాగి వేషం వేసుకుని ఈ దేశంలో తిరుగుతున్నాడని" బైరాగి బుకాయింపులు సారాకొట్టతను నమ్మడు. అతని డబ్బుని తప్ప మరి దేన్నీ నమ్మడు. ఇంతలో కేసు దర్యాప్తు కోసం విశాఖపట్నం వచ్చిన హెడ్ బైరాగిని చూసి తెగ సంతోషపడతాడు. హెడ్ ఉద్యోగం సారా వ్యాపారమంత సూటి వ్యవహారం కాదు. అతని పైన ఇన్‌స్పెక్టర్ ఉన్నాడు. హెడ్‌కి ప్రమోషన్ కావాలి. ఇన్‌స్పెక్టర్‌కీ ప్రమోషన్ కావాలి. హెడ్ ఖూనీ కేసుని మాపు చేశాడని రుజువు చేస్తే ఇన్‌స్పెక్టర్‌కి ప్రమోషన్. ఇన్‌స్పెక్టర్ అనుకున్నట్లు ఖూనీ జరగలేదని రుజువు చేస్తే హెడ్‌కి ప్రమోషన్. ఈఖూనీ కేసు వ్యూహంలోంచి బైటపడి ఉద్యోగం రక్షించుకోటానికి హెడ్‌కి ఏ దారీ దొరకటం లేదు. బైరాగిని ఆశ్రయించటం తప్ప. బైరాగి అంజనం వేసి రహస్యం కనిపెట్టేస్తానంటే 'అమ్మయ్య' అనుకుంటాడు. ఈ చిక్కు తీరితే బైరాగి హరిద్వారంలో కట్టించబోయే మఠానికి నూట పదహార్లిస్తానంటాడు. ఐనాసరే బైరాగి మాయిమాటలు చెప్పి మాయమైపోయాడు. హెడ్ అసలు పనిమాని బైరాగిని వెతకటంలో పడతాడు. అక్కడికీ సారా కొట్టతను చెప్తాడు సారా దుకాణాల్లో వెతికితే కనపడతాడని బైరాగి అక్కడ దొరికినా హెడ్‌కి అభ్యంతరం లేదు.

"సిద్ధులు ఏం చేసినా వారికి తప్పులేదు" అనేది హెడ్ నరనరానా జీర్ణించుకుపోయిన నమ్మకం.

హెడ్ మూఢత్వం చూసినపుడు నవ్వు వస్తుంది. ఆశ్చర్యం కలుగుతుంది. బైరాగి దొంగ సన్యాసని సారాకొట్టతను అంత స్పష్టంగా చెబుతున్నా హెడ్ బైరాగి మానవాతీతుడని, అతనేం చేసిన తప్పులేదనీ ఎందుకనుకుంటున్నాడు? అతను పోలీసు శాఖలో పని చేస్తున్నాడు. పదిమంది జవాన్లకు హెడ్. ప్రమోషన్ వస్తే ఇన్‌స్పెక్టరవుతాడు. దొంగల్ని, ఖూనీకోర్లని చూసే ఉంటాడు. కోర్టులు, శిక్షలు తెలిసే ఉంటాయి. ఐనా సరే బైరాగి మీదే, అతను వేసే అంజనం మీదే నమ్మకం. అక్కడికీ గిరీశం అంటాడు. "యవిడెన్సు యాక్టులో అంజనాలు, పిశాచాలూ సాక్షానికి పనికొస్తాయిటయ్యా" అని. హెడ్‌కి యవిడెన్సు యాక్టు ఎంత తెలుసో దానిమీద ఎంత నమ్మకమో తెలియదు గానీ బైరాగి గురించి మాత్రం తెగ నమ్మకం.

"ఆ బైరాగిని మీరెరగరు. ఆయన గొప్ప సిద్ధుడు. ఏం చెయ్యాలంటే అది చేయగల్డు. అతడు పక్కన ఉంటే నాకు కొండంత ధైర్యం వుండేది. జగన్నాధ స్వామిని సేవించుకుని సాయంత్రం ఒస్తే చాలు" అనుకుంటాడు. ఇది మూర్ఖత్వానికి పరాకాష్ఠ అనిపిస్తుంది గానీ – కన్యాశుల్కం నాటకంలో 'హెడ్'లో కనిపించిన ఆ మూర్ఖత్వం

# చీకట్లో సముద్రం

సలీం



నీళ్ళమీద తెప్పలా తేలియాడుతూ చీకటి
ఒంటరి నక్షత్రం తోడుగా నేను
దూరంగా సరుగుడు తోటలో దూరి
అరుస్తున్న గాలి
రెండు నిశ్శబ్దాల మధ్య
నలిగిపోతున్న సముద్రపు హోరు
కాళ్ళలో మెరిసే వెండి పట్టీల్తో
ఆదివాసీ అందాల గుమ్మ
అలలపైన తేలుతూ
తీరానికి కొట్టుకొచ్చి
క్షణంలో కనుమరుగైనట్లు
తెల్లటి నురగ
ఒంటరితనంలో

చీకటిలా భయపెట్టే అందం
ఆగి ఆగి గుండెలవిసేలా అరుస్తున్న
నీటి రాక్షసి సముద్రం
చిక్కటి రాత్రికి జడుసుకుని
గుక్కపట్టి ఏడుస్తున్న సముద్రం
యిసుక పెదాలతో ముద్దిడి

పూరడిస్తున్న తీరం
కళ్ళు చించుకుని
దిగంతాల్లోకి చూస్తూ
సముద్రాన్ని ఔపోసన పట్టే
ధ్యాన ముద్రలో నేను

యిద్దరి ఆరాటం
అందని ప్రశాంతత కోసమే
నిశ్శబ్దాన్ని ఆర్తిగా పిలుస్తూ
ఎడబాటుని సహించలేక
అనంత దుఃఖంలో
తడిసిపోతూ సముద్రం
నాలో ఎగసిపడే తుఫాన్లు
శాంతించే సమయం కోసం
అనాదిగా ఎదురుచూస్తూ
నిరంతర అన్వేషణలో నేను
ఒంటరితనాన్ని తరిమేస్తూ
రొదరొదగా
సముద్రపు సొదలు...
తీరాన్ని తడిపేస్తూ
చీకటి అలలు...

---

ఇప్పుడు మొత్తం పాలనా రంగం అంతా కనిపిస్తుంటే మనకు నవ్వుకోవాలో, ఏడవాలో కోపం తెచ్చుకోవాలో తెలియదు. రాష్ట్రపతులు, ప్రధాన మంత్రులు, మంత్రులు మొత్తం పాలనా యంత్రాంగమంతా సత్యశాయి బాబా నుండి కల్కి భగవాన్ ఇంకా అనేకానేక స్వాముల, అమ్మవార్ల సేవకి తరలి వెళ్ళటం, దేశ ప్రధమ పౌరులు వారికి పాదాభివందనం చెయ్యటం చూస్తే హెడ్ మూర్ఖత్వం ఏ పాటిది అనిపించదూ?

వీళ్ళంతా స్వామీజీల వద్దకు ఎందుకిలా క్యూలు కడతారనేది వేరే ప్రశ్న. వారి లాభాలు, ప్రయోజనాలు వారికుంటాయని మనకు ఇపుడు తెలుసు. దాన్నించి వేరే వైపు చూస్తే వలసపాలన ఆధునిక పాలనా యంత్రాగాన్నయితే ప్రవేశపెట్టగలిగింది గానీ మూర్ఖపు ఆచారాన్ని ప్రశ్నించిన వేమన పేరుని మోసానికి వాడుకునే బైరాగుల్నించి హిందూ ఆధ్యాత్మికత బైట పడలేకపోయింది. బైట పడకుండా వలస పాలన గట్టిగా అడ్డుకుంది. తరవాత తరవాత కాలంలో మతానికి, ఆధ్యాత్మికతకు రాజకీయాలకు ముడి మరింతగా పడింది. రాజకీయాలకు మతాన్ని, ఆధ్యాత్మికతను వాడుకున్నారు. గాంధీ, అరవిందుల వంటి వారు ఒక రూపంలో వాటిని వ్యాఖ్యానించివాడుకుంటే అనేకమంది అనేక రకాలుగా రాజకీయాలలో మతాన్నీ ఆధ్యాత్మికతనూ రంగరించి చివరకు మోడీ వరకూ, నిత్యానంద వరకూ తెచ్చారు. సారాదుకాణం సన్నివేశం వర్తమానంలో నిత్యానంద మఠంలో మనం చూడొచ్చు.

సారాదుకాణానికి అప్పు ఎగవేసే చిల్లర బైరాగుల స్థాయినించి యోగులు పెద్ద పెద్ద వ్యాపార సంస్థలను నిర్వహిస్తూ, వందల కోట్ల రూపాయలకు అధిపతులై రాజకీయాలను శాసించే స్థాయికి ఎదిగారు. వారిలో పరస్పర సహకారం ఉంది. ఆ సహకారం కూడా కన్యాశుల్కంలో గురజాడ చూపారు. హెడ్ బైరాగిని వెతుకుతుంటే పూజారి గవరయ్య వచ్చి అడుగో అక్కడే ఉన్నాడు. నాకు కనపడుతున్నాడు. నాతో మాట్లాడుతున్నాడని అంటాడు. దానికిక తిరుగులేదు. ఇది బ్రాహ్మణీయ మాయాజాలం. దొంగ ఖూనీ కేసులు పెట్టించటం మాపు చేయించటం, దొంగ సాక్ష్యాలు బనాయించటం ఇవన్నీ కోర్టుల ద్వారా వలసవాదం కల్పించిన లౌకిక మాయాజాలపు అదనపు అవకాశం. జనం మూఢ విశ్వాసాల మీద బతుకుతున్న వారికి చట్టపరంగా కూడా ఆ మూఢ విశ్వాసాల మీద బతికే అవకాశం వలసపాలన కల్పించింది. అప్పుడు పడిన బీజం ఇవాళ వటవృక్షమై పోయింది. బైరాగులు, పూజారి గవరయ్యలూ వీధి కొకరు వెలుస్తున్నారు. అసలు సమస్యను అర్థం చేసుకోలేని సామాన్యులు బైరాగులనే ఆశ్రయిస్తున్నారు. సమస్యలను సృష్టించే వారు బైరాగులను పెంచి పోషిస్తున్నారు. దేశం బైరాగుల చేతుల్లోకి పోకుండా "దేవుడా రక్షించు నా దేశాన్ని!" అని మొత్తుకోవాల్సిన పరిస్థితి నేడుంది.

బైరాగి పాత్ర, సారా దుకాణం సన్నివేశం గురజాడ ఎందుకు రాశాడు అనుకుంటే ఇంత కథ కదిలింది. రెండు యాభయిల ముందే బైరాగుల గురించి గురజాడ హెచ్చరించినా ఫలితం లేకపోయింది. రాజ్యం, మతం, పితృస్వామ్యం, వ్యాపారాల ముడి గట్టిగా పడిపోయింది. విప్పటానికి చాలా శక్తి కావాలి. ముఖ్యంగా మధురవాణి వంటి వారు కావాలి. సామాజిక చలన సూత్రాల రహస్యాలు తెలిసి సమరానికి సిద్ధమైన మధురవాణులు కావాలి. కనీసం సౌజన్యారావు పంతుళ్ళయినా లేని కాలంలో బతుకుతున్న మనకు మధురవాణి దొరికేనా?

చిక్కుముడి వీడేనా? సుబ్బిలాంటి అమాయక బాలల బాల్య వివాహాలు ఆగేనా? బుచ్చెమ్మలు గిరీశాల పాల పడకుండా రక్షింపబడేనా?

గురజాడ ఇచ్చిన కన్యాశుల్కం అనే టార్చిలైట్‌తో సమాజాన్ని పరిశీలిస్తే జవాబులు దొరకవచ్చు.

◆

# ఒక మహానుభావుడి 'యాది'లో...



బి. మురళీధర్

***మరాఠీ, హిందీ, ఉర్దూ భాషా పత్రికల్లో వచ్చిన మంచి వ్యాసాలను తెలుగులోకి అనువదించి వివిధ పత్రికల్లో ధారావాహికంగా ప్రచురించారు. తెలుగులో 400, ఉర్దూ భాషలో 350 వరకూ వ్యాసాలు రాసి ఉంటారని అంచనా. 'యాది' శీర్షిక కింద తన జీవిత అనుభవాలను, జ్ఞాపకాలను గుది గుచ్చి పాఠకులకు అందించారు. ఆయనను ఆంధ్రదేశమంతా 'యాది' సదాశివగానే పిలిచిందంటే ఆ వ్యాసాల ప్రాముఖ్యత అర్థం చేసుకోవచ్చు.***

ఆయన వాక్యం ఎంతో సరళం. వాక్కు ఎంతో ఆత్మీయం. ఆయన ముచ్చట్లు నయాగరా జలపాత ధారలు... ఆయన్ని ఒకసారి కలుసుకొని మాట్లాడినవారు. మరో కలయిక కోసం ఎదురు చూస్తారు. ఆ నిరాడంబర మూర్తిని తమ యాదిలో భద్రపరచుకుంటారు. ఆయనే డాక్టర్ సామల సదాశివ. ఇంకా చెప్పాలంటే 'యాది' సదాశివ.

ఆగస్టు 7న సదాశివ మాస్టారు ఇకలేరనే వార్త పది నిమిషాల్లో రాష్ట్ర నలుమూలలా ఉన్న ఆయన అభిమానులందరికీ చేరిపోయింది 84 ఏళ్ల వయసులో గుండెపోటుతో ఆయన అందరినీ వీడి వెళ్లిపోయారు. ఆయన పార్థివ దేహాన్ని దర్శించడానికి, హైదరాబాద్, వరంగల్, కరీంనగర్, నల్గొండ, నిజామాబాద్‌ల నుంచి సాహితీ మిత్రులంతా ఆదిలాబాద్‌కి తరలివచ్చారు.

1948లో బడిపంతులుగా ఉద్యోగ జీవితాన్ని ప్రారంభించిన సదాశివ భద్రాచలం జూనియర్ కాలేజీ ప్రిన్సిపాల్‌గా 1983లో ఉద్యోగ విరమణ చేశారు. 35 ఏళ్లుగా వేలాది మంది విద్యార్థులకు జ్ఞానదానం చేసిన ఆయన ఆదిలాబాద్ జిల్లా దహెగాం మండలం తెనుగుపల్లెలో 1928 మే 11న జన్మించారు. తల్లి చిన్నమ్మ, తండ్రి నాగయ్య పంతులు. ప్రాథమిక విద్య ఆసిఫాబాద్‌లో, ఉన్నత విద్య హన్మకొండ, వరంగల్‌లలో సాగింది. కొంతకాలం వరంగల్, హన్మకొండలో పనిచేసిన సదాశివ చివరకు ఆదిలాబాద్‌లో స్థిరపడ్డారు. ఇక్కడి మల్టీపర్పస్ హైస్కూల్లో సుదీర్ఘ కాలం 'తెలుగు సార్'గా పనిచేశారు. ఆ కాలంలోనే ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి 1963 వరకూ ఉర్దూ ఎడ్వైజరీ కమిటీ సభ్యునిగా పనిచేశారు. మొదట తెలుగులో పద్యకావ్యాలతో రచనలకు శ్రీకారం చుట్టిన సదాశివ ప్రభాతం (1949), సాంబశివ శతకం (1950), నిరీక్షణము (1952) అనే కావ్యాలు వెలువరించారు.

సదాశివ ఉర్దూ భాషా ప్రావీణ్యాన్ని గమనించిన సురవరం ప్రతాపరెడ్డి, ఉర్దూ భాషా కవితా సౌందర్యన్నీ తెలుగు పాఠకులకు పరిచయం చేయమని సలహా ఇచ్చారు. దీంతో ఆయన 1963లో అమ్జద్ రుబాయీలు, ఉర్దూ సాహిత్య చరిత్ర అనువదించారు. వాటిని సాహిత్య అకాడమీ తరపున ప్రచురించారు. వీటిలో 'అమ్జద్ రుబాయీలు' పుస్తకానికి రాష్ట్ర ప్రభుత్వం ఉత్తమ అనువాద రచనా పురస్కారం ప్రకటించింది. ఆయన అనువాద శైలికీ, పద్య రచనకూ తెలుగు సాహితీకారుల నుంచి మంచి స్పదన వచ్చింది. బెజవాడ గోపాలరెడ్డి తదితరుల ప్రోత్సాహంతో మరిన్ని ఉర్దూ గ్రంథాలను అనువదించారు. వాటిలో మౌలానా రూమీ మస్నవీ (1967, పారసీ నుంచి అనువాదం), మీర్జా గాలిబ్ రచనలూ, జీవితమూ (1969), ఉర్దూ కవుల కవితా సామగ్రి (1970), పారసీ కవుల ప్రసక్తి (1975) ముఖ్యమైనవి. వీటిలో ఏ పుస్తకమూ ఇప్పుడు అందుబాటులో లేకపోవడం విచారకరం. తర్వాత కేంద్ర సాహిత్య అకాడమీ కోసం కౌశరసుత్ (మరాఠీ కవి జీవితం) పుస్తకాన్ని అనువదించారు. 1972లో అయిదో తరగతి తెలుగు వాచకం, 1982లో ఏడో తరగతి తెలుగు వాచకంలో గుండు విప్లవ వీరుడు కొమురం భీం వీరోచిత గాథ గురించి రాసి మొదటిసారిగా ప్రపంచానికి కొమురం భీంను పేరును పరిచయం చేశారు. మరాఠీ, హిందీ, ఉర్దూ భాషా పత్రికల్లో వచ్చిన మంచి వ్యాసాలను తెలుగులోకి అనువదించి వివిధ పత్రికల్లో ధారావాహికంగా ప్రచురించారు. తెలుగులో 400, ఉర్దూ భాషలో 350 వరకూ వ్యాసాలు రాసి ఉంటారని అంచనా. 'యాది' శీర్షిక కింద తన జీవిత అనుభవాలను, జ్ఞాపకాలను గుది గుచ్చి పాఠకులకు అందించారు. ఆయనను ఆంధ్రదేశమంతా 'యాది' సదాశివగానే పిలిచిందంటే ఆ వ్యాసాల ప్రాముఖ్యత అర్థం చేసుకోవచ్చు.

సరళ సుందరమైన వాక్యాలు, పలకరించినట్లుగా ఉండే పద బంధాలు ఆయన రచనల నిండా ఉంటాయి. తెలుగు సాహిత్యంలో అక్కడక్కడా మాత్రమే కనిపించే వ్యక్తి చిత్రణ అనే ప్రక్రియలో ఆయన రాసిన 'వాక్చిత్రాలు ఎంతో మానవీయంగా ఉంటాయి. వాక్యాన్ని సజీవంగా రాయడం, దాన్ని పాఠకుడి హృదయంలోకి సూటిగా

# నానీలు

- రాజేశ్వరి



వర్షాన్ని తాకిన
రవి కిరణం
పులకింతలతో
హరివిల్లు వంగింది!

ఆగిందా ప్రస్థానం?
దిగులొద్దు
సానపడితేనే
వజ్రానికి కాంతి!

నియంతృత్వంపై
కోపించింది పుడమి
తుదకది
భూస్థాపితం!

వెన్నెలతో పులకించింది
కలువకన్నె
చెలుని చూపుతో
చెలియా అంతే!

అంతరాత్మే
మన జీవన నేస్తం
దానిదెప్పుడూ
మేల్కొల్పే హస్తం!

- పడిగ కృష్ణ
8464857176



రైతు మేఘం
బాగా ఏడిస్తే నష్టమే
తక్కువ ఏడిస్తే
మరీ కష్టం

మానవత్వాన్ని
మరుస్తున్నావా?
మదర్ థెరిస్సా వైపు
మరలిచూడు

అన్నదాతే
అంటావా రైతును
పేరు మాత్రం
అచ్చిరావడం లేదు

రాజకీయ క్రీడల్లో
రైతు గాథ
అగాధమైన
అంతులేని వ్యథ

# రెక్కలు

బొమ్మరాత యల్లయ్య 9502051996

మనిషి
బొమ్మ
మనసు
గుప్పిట్లో
ఆడితే వినోదం
ఓడితే విషాదం

కరుణ చూపిస్తే
మానవుడు
కాఠిన్యం దాలిస్తే
దానవుడు
మానవత్వమే
మనిషికి గీటురాయి



బుక్కెడు
బువ్వ
గుక్కెడు
నీళ్ళు
బతుకు చెట్టుకు
అవే మూలం

తృప్తి
స్వర్గం
అసంతృప్తి
నరకం
మనసులోనే
సమస్తం

పెంచితే
పంచుతా
తుంచితే
ముంచుతా
అన్నది చెట్టు
నీ మీదొట్టు

నాడు ఔను
నేడు కాదు
నేడు కానిది
రేపు ఔను
కాలం
మార్పుకు అనుకూలం

ప్రవేశపెట్టగలిగిన నైపుణ్యం ఆయన సొంతం. వాక్చిత్రాల్లో ఆయన పరిచయం చేయదలచుకున్న వ్యక్తి మనముందు సజీవంగా కదలాడుతున్నట్లుగా గోచరిస్తాడు. మన ఎదురుగా కూర్చుని చెప్తున్నట్టుగా ఎంతో ఆత్మీయంగా ఉంటాయి గనుకనే వాటిని ముచ్చట్లు అని పిలుచుకుంటున్నాం. ఆ ముచ్చట్లే వివిధ పత్రికల్లో ధారావాహికంగా వెలువడ్డాయి. వీటిని మలయ మారుతాలు, సంగీత శిఖరాలు, స్వరలయలు పుస్తకాలుగా వెలువరించారు. 'స్వరలయలు'కు 2012లో కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు వచ్చింది. ఆయన పొందిన అవార్డుల్లో 1994లో పొట్టి శ్రీరాములు విశ్వ విద్యాలయం ప్రతిభా పురస్కారం, 1998లో అదే విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేట్, 2002లో కాకతీయ యూనివర్శిటీ గౌరవ డాక్టరేట్, 2006లో అప్పటి సిఎం రాజశేఖర్ రెడ్డి చేతుల మీదుగా అందుకున్న రాజీవ్ ప్రతిభా పురస్కారం ముఖ్యమైనవి. ఇంకా ఎన్నో సత్కారాలు, సన్మానాలు ఆయన వద్దకు నడిచి వచ్చాయి.

ఆయన రచనలను సమీక్షిస్తూ పలువురు సాహితీకారుల అభిప్రాయాలతో, వెల్చాల కొండలరావు సంపాదకత్వంలో 'జయంతి' త్రైమాసిక సాహితీ సంచిక, మే 2010లో పాలపిట్ట మాసపత్రిక ప్రత్యేక సంచిక వెలువరించాయి. ఈ రెండు సంచికలూ ఆయన రచనలనూ, వ్యక్తిత్వాన్నీ, జీవితాన్ని దాదాపు సమగ్రంగా ఆవిష్కరించాయి.

గజల్ ఉస్నే ఛేడీ
ముఝే సాజ్ దేనా
జర ఉమ్రె రఫ్తాకో ఆవాజ్ దేనా

ఆమె గజల్ పాడటం ప్రారంభించింది. నాకు ఒక వాయిద్యాన్నివ్వండి, జత కలుస్తాను. ఆ చేత్తోనే అదిగో వేగంగా పరిగెత్తిపోతున్న నా వయసుని ఒక కేకవేసి ఆగమని చెప్పండి. (సఫీ లఖ్నవీ, గజల్)

తెలుగు సాహిత్యం ఉన్నంత వరకూ ఆయన రచనలు పరిమళాలను వెదజల్లుతూనే ఉంటాయి.

(ప్రజాశక్తి 'సవ్వడి' సౌజన్యంతో)

రచయిత సెల్ : 9440229728



# విశ్వకళావేత్త వెంపటి చినసత్యం

డా॥ సప్పా దుర్గాప్రసాద్

**కూచిపూడి నృత్యం అంటే వెంటనే గుర్తొచ్చే పేరు వెంపటి చిన సత్యం. కూచిపూడికి విశ్వవ్యాప్త ఖ్యాతి సముపార్జించటానికి ఆయన చేసిన కృషి అనన్య సామాన్యం. ప్రపంచ వ్యాప్తంగా నేడు వేలాదిమంది కూచిపూడిని నిత్య నర్తనం చేస్తున్నారంటే ప్రత్యక్షంగా పరోక్షంగా ఆయన చేసిన ప్రయోగాలూ, నేర్పిన నడకలే కారణం. మనరాష్ట్ర నృత్యంగా పేరొందిన కూచిపూడి నిరంతరంగా, నిర్విరామంగా సాగటానికి జీవితాంతం పాటుపడ్డ కృషీవలుడు వెంపటి చినసత్యం.**

అనాదిగా వస్తున్న ఎన్నో శాస్త్రీయ నృత్య సాంప్రదాయాలు అంతరించిపోతున్న తరుణంలో... ఎక్కడో బాలి ద్వీపంలో పుట్టిన నటరాజ రామకృష్ణ ఆంధ్రదేశం వచ్చి శాస్త్రీయ నృత్య కళావ్యాప్తికి పూనుకొన్నారు. ఎన్నో శాస్త్రీయ నృత్య రీతులను గురించి పరిశోధించి, ప్రతిష్ఠించి కీర్తిమంతులయ్యారు. అలాగే ఈ రాష్ట్రంలో పుట్టిన వెంపటి చిన సత్యం పరాయి రాష్ట్రంలో అడుగుపెట్టి విద్యను విశ్వవ్యాప్తం చేశారు. వీరిద్దరూ వేదాంతం లక్ష్మీ నారాయణశాస్త్రి శిష్యులు కావడం యాదృచ్ఛికం. శాస్త్రీయ నృత్య ఔన్నత్యానికి వీరిద్దరూ ఎనలేని కృషి చేశారు.

1929 అక్టోబర్ 25న కృష్ణా జిల్లాలో తరతరాలుగా భాగవతులకు నెలవైన కూచిపూడి గ్రామంలో వెంపటి చలమయ్య వరలక్ష్మి దంపతులకు చిన సత్యం జన్మించారు. భాగవత, రామాయణాది పురాణాలను కూచిపూడిలో కళాత్మకంగా ప్రదర్శించిన శాస్త్రవిద్యా పారంగతులు ఆంధ్ర కూచిపూడి భాగవతులు. పరాయి పాలనలో విద్యకు తగ్గ ఆదరణ లేక, జీవనం కష్ట సాధ్యం అవుతున్న సమయంలో, అప్పుడే నిలదొక్కుకుంటున్న చలనచిత్ర పరిశ్రమ వైపునకు వీరు మళ్ళారు. కూచిపూడి నాట్య విద్యా మర్మమెరిగిన వెంపటి చిన సత్యం యుక్తవయసులో కాలినడకన మద్రాసు నగరం చేరారు. తనకంటే ముందు మద్రాసు నగరం చేరి రాణిస్తున్న పెద సత్యం, వేదాంతం రాఘవయ్య ప్రోత్సహం, ఆదరణలతో చలనచిత్రాలకు నృత్య దర్శకత్వం వహించారు. దేవదాసు, నర్తనశాల వంటి సుమారు 100 చలనచిత్రాలకు ఆయన నృత్య దర్శకత్వం వహించారంటే సామాన్యమైన విషయం కాదు. ఆయన మద్రాసు నగరంలో తన ప్రాబల్యాన్ని పెంచుకొని, సినీరంగ దృష్టిని కూచిపూడి నాట్యాభ్యాసం వైపు మళ్ళించగలిగారు. ఒకప్పుడు చలన చిత్రాల్లో రాణించాలంటే శాస్త్రీయ నృత్య విద్యాభ్యాసం తప్పనిసరి. మగవారైనా, ఆడవారైనా విధిగా నృత్యం నేర్చుకోవాలి. అలా అనేకమందికి గురువుగా రాణించి, ఆర్థికంగా, సామాజికంగా తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని కష్టపడి సాధించారు.

పండితులకు శాస్త్రం రాణిస్తేనే తృప్తి. ఆ శాస్త్రం విశ్వవ్యాప్తమైనపుడే సంతృప్తి. ఎన్ని చలన చిత్రాలకు నృత్యం సమకూర్చినా, కూచిపూడి సాంప్రదాయ నాట్యానికి అంతర్జాతీయ ఖ్యాతి తేవాలనే తపన ఆయనను వెన్నాడుతూ ఉండేది. అందుకే 1963లో కూచిపూడి ఆర్ట్స్ అకాడమీని ప్రారంభించారు. ఆనాటి తారలంతా ఆ అకాడమీలో విద్యార్థులుగా చేరారు. చంద్రకళ, రాజసులోచన, హేమమాలిని, రేఖ, మంజుల, వాణిశ్రీ, ప్రభ, మంజుభార్గవి వంటి ఎందరో కథానాయికలు ఆయన శిష్యులయ్యారు. కూచిపూడి నాట్య ప్రసిద్ధులైన శోభానాయుడు, బాలా కొండలరావు. మూర్తి వంటి వారెందరినో ఆయన తీర్చిదిద్దారు. విశ్వవిఖ్యాత నట సార్వభౌముడు నందమూరి తారక రామారావు కూడా నర్తనశాలలో బృహన్నల పాత్ర పోషణ కోసం వెంపటి చిన సత్యం వద్ద నృత్యం అభ్యసించారు.

శ్రీనివాస కళ్యాణం. శ్రీకృష్ణ పారిజాతం, రుక్మిణీ కళ్యాణం, అర్ధనారీశ్వరం, హరవిలాసం, రామాయణం, క్షీరసాగర మథనం, కిరాతార్జునీయం వంటి ఎన్నో నృత్య నాటకాలను సత్యం రూపొందించారు. ఒకనాటి కూచిపూడి యక్షగాన సాంప్రదాయాన్ని వదిలి, కూచిపూడి నాట్యాన్ని ఏకపాత్ర కేళికగా రూపుమార్చి ఎన్నో ప్రదర్శనల ద్వారా గుర్తింపు తెచ్చారు. అనంతర కాలంలో కూచిపూడి సాంప్రదాయ ఆది విధానం, ప్రదర్శనా రీతి ఏమాత్రం పక్కదారి పట్టకుండా తన నృత్య నాటకాల ద్వారా ప్రపంచదేశాల్లో ప్రశంసలు పొందారు. కూచిపూడి నాట్యకళకు అంతర్జాతీయ ఖ్యాతిని అందించారు. కావలి విశ్వోదయా కళాశాల వారి కోసం ఆయన సమకూర్చిన 'శ్రీకృష్ణ పారిజాతం' నృత్య రూపకమే ఈ నాటకాలన్నింటికీ నాంది అని చెప్పవచ్చు. ఆయనకు ముందు తరం వారైన వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రి, తాడేపల్లి పేరయ్య శాస్త్రి, వేదాంతం పార్వతీశం వంటి ఉద్ధండులను మించి, తనతరం వారైన వేదాంతం సత్యనారాయణ శర్మ, ప్రహ్లాదశర్మ, కోరాడ నరసింహారావుల కన్నా మిన్నగా రాణించారు చిన సత్యం. ఆంధ్రదేశపు కూచిపూడి నాట్యకళకు అంతర్జాతీయ ఖ్యాతిని

## మాకు మా ఊరే కావాలి

జుగాష్‌విలి 9848266384

ఎక్కడ మా శిరస్సులు నేలరాలాయో
అక్కడే మా తలలు తలలెగరేయాలి

ఎక్కడ మా నెత్తురు ఏ మట్టిలో యింకిందో
అక్కడే మా జీవితాలు పుష్పించి పరిమళించాలి

ఎక్కడ మా కనుగుడ్లు పెకలించబడ్డాయో
అక్కడే మా క్రొన్నెత్తుటి క్రోధం పోటెత్తాలి

మా ఆత్మగౌరవాన్ని పరిహసించేవి ఏవీ
మాకు సుఖాలనూ ఆనందాలనూ యివ్వలేవు

మేం ఓడిపోయి మా ఊరు విడిచి
ఎక్కడికో వలసవాసులుగా పోలేం
కాలనీ కంచెల మధ్య పరాయి కాలేం

మా భూములకు మా బతుకులకు సోకిన
కులాధీన వర్గ పురుగుల్ని హతమార్చే
క్రిమి సంహారక మందు ఏదో యిప్పుడు అన్వేషించాలి

క్రూర మృగాలు లేని చోటులేదు
వాటిని వేటాడే పరికరాలు ఏవో మాకు కావాలి
మాకు మా ఊరే కావాలి

... ... ...

పరిధి దాటని ఉద్యమాలొకవైపు
పెకలించి పెనుకంపన పుట్టించాలనే ఉద్యమాలొకవైపు

ఇప్పుడు
నేను
ఈ సందిగ్ధ ఉద్రిక్త చౌరస్తాలో నిలబడి
ఈ మాటలు మాట్లాడుతున్నాను
నిన్నటి క్రూర విషాధ వాంగ్మూలాన్ని
నేటి ఆచరణాత్మక సాదృశ్యాన్ని
నేను
లక్షింపేటను మాట్లాడుతున్నాను

## నా నిజాలు

శ్రీమతి సింహాద్రి జ్యోతిర్మయి
9866014619

ఆలోచనల పురిటి నొప్పులు
ప్రసవించిన అక్షర శిశువు
- కవిత్వం

జీవితమనే ప్రయాణాన్ని
మృత్యు తీరానికి
నడిపించే నావ
- వయసు



మృగత్వం
మనిషిలోకి ప్రవేశించింది
అడవి
నగరంగా మారడంతో

కాగితం గుండెపై
కలం పోటు
- అక్షరం

ఆకాశంలో సగం
ఆడవారి దన్నారు
ఆలోచిస్తే అర్థమయ్యింది
ఆకాశమంటే
శూన్యం కదూ !

విలువలు వలువలు
విప్పేసి
నగ్నంగా ఆడుతోంది
సినిమా

నేటి యువత
ప్రేమిస్తోంది
చచ్చిపోయేటంతగా
లేదా
చంపేసేటంతగా

మనసులో ముసురుకున్న
బాధల మబ్బులు
చల్లని ఓదార్పు గాలికి
కురిసే వర్షం
కన్నీరు

ప్రకృతికి **విరోధి**
మానవ **వికృతి**
**శిఖరం** చేరుకుంది
**నందనం** వైపు నడిపించు
**విజయం** అందుతుంది
లోకం **జయ** మంటుంది

ఎన్నికలలో
ఎన్ని కలలో
నాయకులకు

ఆయనే సముపార్జించి పెట్టారు. కూచిపూడి నాట్యం తలంపునకు రాగానే ముందుగా స్ఫురణకు వచ్చే వ్యక్తి వెంపటి చిన సత్యం మాష్టారే. ఆయన కీర్తి సహస్ర వర్షాలు నిలుస్తుంది.

ఎన్నో అటుపోట్లకూ, ఒడిదుడుకులకూ లొంగని స్థిత ప్రజ్ఞత్వం, నృత్య పాండిత్యం ఆయనకు సర్వదా శతధా రక్షగా నిలిచాయి. ఆయనకు ఎన్నో గౌరవాలు దక్కాయి. 1980లో ఆంధ్ర విశ్వ విద్యాలయం గౌరవ డాక్టరేట్ కళా ప్రపూర్ణ, 1967లో కేంద్ర సంగీత నాటక అకాడమీ ఫెలోషిప్, 1987లో భారత కళాప్రపూర్ణ, 1992లో కాళిదాస సమ్మాన్, సర్ సింగార్ పురస్కారం, సప్తగిరి సంగీత విద్వన్మణి, నాట్య కళాతపస్వి, తమిళనాడు ప్రభుత్వ అత్యున్నత పురస్కారం కళైమామణి, నాట్యకళాభూషణ, 1998లో కేంద్ర ప్రభుత్వ పద్మభూషణ్, 2011లో జీవిత సాఫల్య పురస్కారం ఇలా ఎన్నో పురస్కారాలు, సన్మాన సత్కారాలు ఆయనను వరించాయి. లండన్, పారిస్, మలేషియా, అమెరికా, శ్రీలంక, జర్మనీ, యూరప్, అరబ్ తదితర దేశాలు సైతం ఆయన పాండిత్యాన్ని తిలకించి, సత్కరించాయి. తిరుమల తిరుపతి దేవస్థానంలో అమెరికాలోని ఫిట్స్‌బర్గ్ వెంకటేశ్వర స్వామి దేవస్థానంలో ఆస్థాన నాట్యాచార్యునిగా చిన సత్యం పనిచేశారు. కూచిపూడి నాట్య ప్రక్రియను విశ్వవ్యాప్తం చేసిన మహానుభావుడు వెంపటి చిన సత్యం మాష్టారు. ఆయన వెయ్యేళ్ళ కీర్తి మంతులు అనడం సత్యం. చిరస్మరణీయుడు అనేది నిత్య సత్యం. కూచిపూడి నాట్య కళాకారులందరికీ ప్రాతఃస్మరణీయుడనేది జగమెరిగిన సత్యం.

**(ప్రజాశక్తి 'సవ్వడి' సౌజన్యంతో) రచయిత సెల్: 9849273096**



# అధ్యయన మేరువు

## గంగిశెట్టి లక్ష్మీనారాయణ

**భద్రిరాజు కృషి తెలుగుక్రియాధాతువుల పరిధి దాటి, వాటి చారిత్రక వికాసాన్ని చర్చించడంతోపాటు, తులనాత్మకంగా అన్ని ద్రావిడ భాషల స్వరూపానికి విస్తరించి, మూలాలను తవ్వి తలకెత్తడంతోపాటు, మూల ద్రావిడ భాషా స్వరూపాలను స్పష్టంగా, శాస్త్రీయంగా ఆవిష్కరించింది. ప్రపంచంలోని ద్రావిడ వైజ్ఞానికుల్లో, అంతదాకా సర్వోన్నతంగా నిలిచిన ఆచార్య బరో, ఎమినోల సరసన, వారితో సమంగా సమున్నత స్థానంలో నిలిపింది. వారిద్దరూ కలిసి రూపొందించిన శిఖరస్థాయి ఆధార గ్రంథం, ద్రవిడియన్ ఎటిమలాజికల్ డిక్షనరీలో భద్రిరాజు కనుగొన్న అంశాలను పది, పదిహేను చోట్ల ప్రస్తావించి, 'అక్నాలెడ్జ్' చేసే స్థితిలోకి అది చేరింది.**

ఒక శకం అంతరించింది. తెలుగు భాషాధ్యయనంలో ఒక గొప్ప అధ్యాయం ముగిసింది. తెలుగు భాష అధ్యయనాన్ని తెలుగు నేల మీదే కాదు. భారతదేశంలోనే కాదు, ప్రపంచమంతటా విస్తరింపచేసి, తెలుగు అధ్యయనానికి ఒక ప్రత్యేక శాస్త్రీయ గౌరవాన్ని సంతరించిపెట్టిన ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి గారు ఇకలేరు. 1928 జూన్ 19న ఒంగోలులో సుబ్రహ్మణ్యం, భారతమ్మ గార్ల పుణ్యఫలంగా కళ్లుతెరచి తెలుగులోకం వచ్చిన కృష్ణమూర్తిగారు, ఎనిమిది పదుల సుదీర్ఘ జీవనానంతరం, అందులో ఏడుపదుల దాకా తెలుగు పలుకుల తల్లికి శక్తి మంతమైన, అర్థవంతమైన సుదీర్ఘసేవ చేసిన అనంతరం, హైదరాబాదులో స్వగృహం 'భారతి'లో, 2012 ఆగష్టు 11 తెల్లవారుజాము 2 గంటలకు తన తుదిశ్వాస విడిచారు. తెలుగుతల్లి బరువైన నిట్టూర్పు వెంట కాదు ఒక నిశ్శబ్ద వేదనాశ్వాస వెంట ఏ వెలుగుల లోకాలకో తరలివెళ్లారు. అనంతమైన తన కృషి వెలుగును ఈ లోకంలో విడిచి వెళ్లారు.

వారి గురించి సూటిగా చెప్పాలంటే ఒక్క మాట అతిశయోక్తి కాదు. శాస్త్రీయమైన కర్ణాటక సంగీతం ఏ ఖండాంతరంలో వినిపించినా, త్యాగరాజు మూలంగా, అక్కడికి తెలుగు చేరింది. విధిగా తెలుగు మాట చేర్చుకోబడింది. శాస్త్రీయమైన భాషాశాస్త్ర అధ్యయనం, ప్రపంచంలోని ఏ దేశంలో జరుగుతున్నా భద్రిరాజు మూలంగా, అక్కడికి తెలుగు మాట చేరింది, నేర్చుకోబడింది....

సమగ్ర భాషాశాస్త్ర అధ్యయనంలో ద్రావిడ భాషా కుటుంబం అధ్యయనం తప్పనిసరి. ద్రావిడ భాషల అధ్యయనం వద్దకు వచ్చేసరికి, ఆచార్య భద్రిరాజు గారి అపార ప్రతిభాత్మక పరిశోధన గ్రంథం తెలుగు వెర్బల్ బేసిస్ (తెలుగు క్రియాధాతు స్వరూపం) ప్రధాన ఆధార గ్రంథంగా ప్రపంచమంతా ఉపాదేయమవుతున్నది. అంచేత విధిగా తెలుగు ప్రధాన ఫోకస్ కేంద్రంగా ద్రావిడ భాషల అధ్యయనం జరగకతప్పదు. 1948-49 ప్రాంతాలలో, ఆచార్య గంటి సోమయాజిగారి మార్గదర్శకత్వంలో బీజంపడి, ఆంధ్రవిశ్వ విద్యాలయంలో ప్రారంభమైన ఆ పరిశోధన కృషి, 1953లో ఫుల్ బ్రైట్, స్మిత్-ముంటే ఫెలోషిప్పులతో అమెరికాలోని పెన్సిల్వేనియా విశ్వవిద్యాలయంలో శాస్త్రీయంగా నిగ్గుదేలి, ఆ తర్వాత రాక్‌ఫెల్లర్ ఫెలోషిప్పుతో, కాలిఫోర్నియా విశ్వవిద్యాలయం, బెర్కిలీలో ఆచార్య ఎంబి ఎమినో గురుత్వంలో పరిపుష్టమై, 1957లో పెన్సిల్వేనియా విశ్వవిద్యాలయం నుంచి పిహెచ్‌డి డిగ్రీని సాధించింది. ఆ సిద్ధాంత గ్రంథాన్ని కాలిఫోర్నియా విశ్వవిద్యాలయం, భాషాశాస్త్ర రంగంలో తన 24వ ప్రకటనగా, 1961లో ప్రచురించింది. 61లో వచ్చిన ఆ ప్రచురణ, అంతదాకా సాగుతున్న ద్రావిడ భాషాధ్యయనాన్ని సంపూర్తిగా మలుపు తిప్పింది. ద్రావిడ భాషల అధ్యయనానికి, అప్పటిదాకా ఎంత ప్రాథమికమైన బిషప్ కాల్డ్‌వెల్ గ్రంథమే ప్రధాన ఆధారం అప్పటికెప్పుడో దాదాపు వందేళ్ల క్రితం వెలువడ్డ పుస్తకం. చాలా తక్కువ సంఖ్యలో 12 లేదా 13 భాషలను మాత్రమే పరిశీలించిన గ్రంథం. అది అసంపూర్ణమూ, అసమగ్రమూ అనేది అందరికీ తెలుసు. ఆచార్య బరో స్ఫూర్తితో, ద్రావిడ భాషల మీద విస్తృతంగా, నవీన శాస్త్రీయ అధ్యయనాలు మొదలైనా, విడివిడి భాషల మీద మోనోగ్రాపులు గానో విడివిడి అంశాల మీద వ్యాసాలుగానో వైజ్ఞానిక సమాచారం లభ్యమవుతోంది కాని, ఒక్కటిగా సమన్వయాత్మకంగా, శాస్త్రీయంగా, తులనాత్మకంగా పరిశీలిస్తున్న ప్రామాణిక గ్రంథం లభ్యం కావడం లేదు. భద్రిరాజు కృషి తెలుగుక్రియాధాతువుల పరిధి దాటి, వాటి చారిత్రక వికాసాన్ని చర్చించడంతోపాటు, తులనాత్మకంగా అన్ని ద్రావిడ భాషల స్వరూపానికి విస్తరించి, మూలాలను తవ్వి తలకెత్తడంతోపాటు, మూల

ద్రావిడ భాషా స్వరూపాలను స్పష్టంగా, శాస్త్రీయంగా ఆవిష్కరించింది. ప్రపంచంలోని ద్రావిడ వైజ్ఞానికుల్లో, అంతదాకా సర్వోన్నతంగా నిలిచిన ఆచార్య బరో, ఎమినోల సరసన, వారితో సమంగా సమున్నత స్థానంలో నిలిపింది. వారిద్దరూ కలిసి రూపొందించిన శిఖరస్థాయి ఆధార గ్రంథం, ద్రవిడియన్ ఎటిమలాజికల్ డిక్షనరీలో భద్రిరాజు కనుగొన్న అంశాలను పది, పదిహేను చోట్ల ప్రస్తావించి, 'అక్నాలెడ్జ్' చేసే స్థితిలోకి అది చేరింది. కాల్డ్‌వెల్ గ్రంథాన్ని నిస్సంశయంగా పరాస్తం చేయడమే కాదు, దానివల్ల అప్పటి దాకా ఉన్న తమిళం మీది ఫోకస్‌ను తప్పించి, తెలుగు మీద ఫోకస్‌ను తిరుగు లేకుండా నిలిపింది. ప్రపంచవ్యాప్తంగా తెలుగుకు ఇంతకంటే గొప్ప సేవ ఉండదు. అయితే నిరాడంబరంగా, నిశ్శబ్దంగా సాగిన కృషి మాత్రంగానే అది నిలిచిపోయింది. సృజనాత్మక రంగంలోని వారికి లభించే ఆడంబర ప్రచారం, శాస్త్రీయ రంగంలోని వారికి రాదు కదా! ఆచార్య భద్రిరాజు గారు శాస్త్రీయ రంగంలో అందుకొన్న ఆ కీర్తి శిఖరం చాలా గొప్పది.

ఇంత కీర్తి శిఖరం అందుకోవడంలోని అసలు కీలకం ఏమిటి? ఆయనలో ఒక శాస్త్రకారుడి పరిశ్రమ, నిష్కర్షలతో పాటు, ఒక సృజనాత్మకశీలి ప్రతిభ దాగుంది. అదే ఒకడుగు ముందుండి ఆయన్ను నడిపించింది. బహిర్వాస్తవాల వర్ణన మాత్రమే శాస్త్రజ్ఞులైనా, మరెవరైనా సాధారణంగా చేస్తుంటారు. అయితే లోతుకు వెళ్లి అంతర్వాస్తవాలను సందర్శించడంతో పాటు, వాటి మధ్య ఉన్న అంతస్సంబంధాలను ఆకళింపు చేసుకొని, వాటిని తనదైన రీతిలో బహిర్గత పరుస్తాడు సృజన శీలి. చూస్తున్నవాళ్లను తన సృష్టిలోకి తీసుకువెళ్తాడు. ఆకళింపు చేసుకొన్న అంశాలను పునఃకల్పన జోలికి వెళ్లకుండా, పూర్తి నిస్సంగతతో సూత్రాలుగా ఆవిష్కరిస్తాడు ప్రతిభ ఉన్న శాస్త్రజ్ఞుడు. అలా తెలుగు భాషకు లభించిన ఒక సృజనాత్మక శాస్త్రవేత్త భద్రిరాజు గారు. ఆయన తరంలోని వారందరి లాగే మొదట్లో ఆయన సాహిత్యరంగంలోనే అడుగు మోపారు. చిన్నప్పుడే కవిత్వం రాశారు. చిన్న సమావేశాల్లో అవధానాలూ చేశారు. 14 ఏళ్ల ప్రాయానికే, శ్రీనాథుని ప్రౌఢశయ్య తలపించేలాగా, ప్రౌఢమైన వృత్తాలతో, 300 పద్యాలున్న మాతృ సందేశం' ఆనాటి క్విట్ ఇండియా ఉద్యమ స్ఫూర్తిని తీసుకొని, దేశ భక్తిని చాటుతూ రాశారు. 'పితృస్మృతి' మీద వారు రాసిన పద్యాలు చాలా ఆర్ద్రంగా, కంటతడి పెట్టించేలా ఉంటాయి. అలాటి ఆర్ద్రమైన ఖండికలన్నీ ఆయన నోటుబుక్కులకే బహు శతాబ్దాలు పరిమితమై ఉండగా, అత్యంత ఆత్మీయులకు మాత్రమే వినే అవకాశం దక్కుతుండా, దాదాపు రెండేళ్లు పోరి, ఆయనను ఒప్పించి వేదగిరి రాంబాబు సహకారంతో 'చిన్ననాటి పద్యాలు' పేరిట 1998లో ప్రకటింప చేసే భాగ్యం ఈ వ్యాస రచయితకు లభించింది. ఆయనకు విశ్వనాథ గారంటే ఎంత గౌరవమో, జాషువా గారి కవిత్వమంటే, దువ్వూరి గారి కవిత్వమంటే అంత ఇష్టం. ప్రాచీన కవులనేకుల పద్యాలు కంఠతా. తిక్కన గారంటే అపారమైన భక్తి తాత్పర్యాలు. తిక్కన గారి భాషా సాహిత్య వారసత్వ సంపద మీద ఒక మంచి గ్రంథం రాయాలన్నది వారిని జీవితాంతం వెంటాడిన ఆకాంక్ష. అది వచ్చి ఉంటే ఎంత గొప్పగా ఉండేదో! కె.కె. రంగనాథాచార్యుల గారి పూనిక మీద, వారి కృషితో వెలువడ్డ 'భాషా, సమాజం, సంస్కృతి' తృతీయ ముద్రణలో కొరతను కొంతయినా తీరుస్తూ "తిక్కనలో 'పలుకుల పొందు' కవితా శిల్ప సమీక్ష' అనే 35 పుటల సుదీర్ఘ వ్యాసాన్ని చేర్చారు. అబ్బూరి, దివాకర్ల గార్లతో పాటు, తిక్కన పదప్రయోగకోశాన్ని మూడు సంపుటాల్లో నిర్మించినా, దాని నిర్మాణంలో ప్రధాన కృషి వారిదే తెలుగులో పద ప్రయోగకోశాల తయారీకి ప్రేరణగా నిలిచింది కూడా వారే. వాటి నిర్మాణాల మెథడాలజీకి నిర్దిష్టతను కూర్చింది కూడా వారే. ఆ విధంగా ప్రత్యక్షంగా తిక్కన మీద, పరోక్షంగా నన్నయాది మహాకవుల మీద పదప్రయోగకోశాల తయారీకి వారూ, వారి ప్రధాన ప్రేరణా భాగస్వామ్యంతో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ తెలుగు భాషకు చేసిన కృషి అనల్పమైంది, అసమానమైంది.

**సర్వోన్నతంగా నిలిచిన ఆచార్య బరో, ఎమినోల సరసన, వారితో సమంగా సమున్నత స్థానంలో నిలిపింది. వారిద్దరూ కలిసి రూపొందించిన శిఖరస్థాయి ఆధార గ్రంథం, ద్రవిడియన్ ఎటిమలాజికల్ డిక్షనరీలో భద్రిరాజు కనుగొన్న అంశాలను పది, పదిహేను చోట్ల ప్రస్తావించి, 'అక్నాలెడ్జ్' చేసే స్థితిలోకి అది చేరింది. కాల్డ్‌వెల్ గ్రంథాన్ని నిస్సంశయంగా పరాస్తం చేయడమే కాదు, దానివల్ల అప్పటి దాకా ఉన్న తమిళం మీది ఫోకస్‌ను తప్పించి, తెలుగు మీద ఫోకస్‌ను తిరుగు లేకుండా నిలిపింది. ప్రపంచవ్యాప్తంగా తెలుగుకు ఇంతకంటే గొప్ప సేవ ఉండదు**

భద్రిరాజు గారిని భాగస్వామిని చేసి, అకాడమీ ఈ కృషికి తొలిపాదు వేయడమే కాదు, భద్రిరాజు గారి దృష్టిని సాహిత్యం వైపు నుంచి, భాష వైపు మరల్చి, వారిలో శాస్త్రజ్ఞుణ్ణి బయటకు తెప్పించింది. అప్పటి భావ కవితా యుగంలో తన కంటూ ఒక స్థానం ఏర్పరచుకొన్న అబ్బూరి రామకృష్ణారావు గారే. ఆ శాస్త్రజ్ఞునికి సరైన తీర్పునిచ్చింది ఆచార్య గంటి సోమయాజి గారు. బలమైన చారిత్రక భాషా శాస్త్రజ్ఞునిగా తర్ఫీదునిచ్చింది, పెన్సిల్వేనియాలోని హెన్రీ హోనిగ్‌స్వాల్ గారు. ఆ తరువాత తిరుగులేని తులనాత్మక విజ్ఞానిగా నిలబెట్టింది కాలిఫోర్నియాలోని ఎమినో గారు. వారి దృక్పథాలు, అవగాహనలు, అంకిత భావనలు అన్నీ కలిసి ఒక్క భద్రిరాజు గారిని ప్రపంచ భారతీయ - ద్రావిడ విజ్ఞానానికి అందించాయి. తెలుగు వారి పుణ్యమా అని తెలుగుకి అందించాయి. గురువుల పట్ల వారి గౌరవం ఎలాటిదంటే ఇవ్వాళ ప్రపంచంలోనే ద్రావిడ భాషల మీద సర్వోన్నత ప్రామాణిక గ్రంథమైన 'ది ద్రవిడియన్ లాంగ్వేజెస్' (కేంబ్రిడ్జి ప్రకటన, 2003) పుస్తకం రచిస్తూ, అందులోని ముఖ్య అధ్యాయాలను, అచ్చుకు ముందే హోనిగ్‌స్వాల్ గారికి, ఎమినో గారికి చూపించి, వారి ఆమోదం పొందాక, చేసిన సూచనల మేరకు సవరిస్తూ, ముద్రణ ప్రతిని తయారు చేశారు. అప్పటికే ఆయన ఖండాంతర కీర్తి పొందినవారు. అయినా సరే, ప్రామాణికత విషయంలో నిత్య విద్యార్థిలాగానే పరిశ్రమించారు. గురువులైన వారికే కాదు,

## మారణం

రాణి పులోమజా దేవి

9849384891

పచ్చని చెట్ల పచ్చిక బయళ్ళ
వెచ్చని గుహల వేడివాగుల

పక్షి కువకువల నదుల గలగలల
పున్నమి రాత్రుల అమవస అంచుల

స్వచ్ఛజీవనపు అచ్చపోకడల
చేజేతులా త్రోసిరాజని
నియంత్రించేసి గాలిని, నీటిని,



నీటిపాల్జేసి నిప్పుని, మన్నుని
వద్దు పొమ్మని చెట్టుని, గుట్టని,

దూరం చేసేసి అమ్మ ప్రకృతిని,
చేరదీశాడు రోగపుగనిని
మానవుడే !

## పోరుబాట



కోగిల చంద్రమౌళి

9553337891

కాసింత కూటికోసం చెమట
నా తనువంత సెలయేటి ధారలయింది
చినిగిన అంగీ, మాసిన పంచె, అర్ధాకలికోర్చుకొని
కొని తెచ్చిన పనిముట్లు, ఊరి కడపటి
పూరి గుడిసె ఇది
నా ఆరుగాలపు శ్రమ ఫలితం
కలకాలం కష్టించినా
నా ఆలి పసుపు తాడుకు పసిడే లేదు
పోషకాహారం పొందని నా దేహం నేడు
ఎముకలు తేలిన అస్థి పంజరం
ఐనా... కనుకొలుకుల్లో ఊపిరి నింపుకొని
యాంత్రీకరణ తెచ్చిన కైకిలి కరువును
ప్రతిఘటించ పోరుబాట సాగిన...

---

ప్రతిభావంతులైన జి. ఉమా మహేశ్వరరావు గారి వంటి తన శిష్యులకు కూడా పంపి వారి అభిప్రాయాలను కూడా తీసుకొన్నారు. విద్యా ప్రతిభ, ప్రామాణికతల విషయంలో వారెప్పుడూ చిన్నా పెద్దల తేడా చూడలేదు. అందుకే అంత పెద్ద శిఖరాలకు ఎదిగారు. సునీత్‌కుమార్ ఛటర్జీ తర్వాత, యావత్ప్రపంచం మీద గుర్తించిన భారతీయ భాషా విజ్ఞానిగా గౌరవింపబడ్డారు. లింగ్విస్టిక్స్ సొసైటీ ఆఫ్ అమెరికా నుంచి ఆ ఏకైక గౌరవాన్ని ఛటర్జీ గారి తర్వాత ఆయనే పొందారు. కేంబ్రిడ్జి ప్రచురించిన 'ద్రవిడియన్ లాంగ్వేజెస్' మీద యాషర్ గారు సమీక్ష రాస్తూ అన్న మాట, ఆయన కృషి స్థానాలకు ఒక సంక్షిప్త సూచిక. "ఇంతకు మునుపు 'తెలుగు వెర్బల్ బేసిస్'తో బిషప్ కాల్డ్వెల్‌ను ఔట్‌డేట్ చేశారు. ఇప్పుడు ఈ రచనతో తన్ను తానే ఔట్ డేట్ చేసుకున్నారు". ఎదుగుతున్న ప్రపంచంతో పాటు ఎదుగుతూ, తాను ఎంచుకొన్న రంగాన్ని ఎదిగించిన అరుదైన వ్యక్తి ఆచార్య భద్రిరాజు.

తెలుగు భాషకు సంబంధించి మాస్టారు నిత్యం ఆశించిన అంశాలు రెండు, చారిత్రక వికాసాన్ని వివరిస్తూ తెలుగు వారికి ఒక బృహత్ నిఘంటువు ఏర్పడాలి. ఆధునిక అవసరాలకు తగ్గట్లు భాషను ఎప్పటికప్పుడు నవీకరిస్తుండాలి. వారి దృక్కోణాల రూపమే తెలుగు విశ్వవిద్యాలయం భాషా పీఠంలోని నిఘంటు నిర్మాణ, భాషా నవీకరణ శాఖలు. తెలుగు విశ్వవిద్యాలయం ఏర్పాటుకు ఆవుల సాంబశివరావు కమిటీ పేరిట సమర్పించిన 5 అధ్యాయాల సమగ్ర నివేదికలో మొదటి మూడున్నర అధ్యాయాలు వారు రాసినవే. ఒకటిన్నర అధ్యాయాలు మాత్రం దోణప్ప మాస్టారు గారు రాశారు. దగ్గరగా చూసిన మా వంటి వారందరికీ ఆ విషయం తెలుసు. ఆ రిపోర్టు, విశ్వవిద్యాలయానికి ఒక మేనిఫెస్టోలాంటిది. దాని గురించిన స్పృహే, అక్కడ వైస్ ఛాన్సెలర్లుగా వచ్చిన వాళ్లకు లేకపోయింది. ఆ రిపోర్టు ప్రతి కూడా విశ్వవిద్యాలయంలో లేదని ఒక పూర్వ ఉపాధ్యక్షులన్నారు. కొత్తగా వచ్చిన ప్రతి వారినీ మేష్టారే పలకరించి, 'తన వద్ద ఆ ప్రతి ఉందని, ఒకమారు దాన్ని చూడండని' కోరేవారు. ఒకరన్నట్లు 'ఎవరెవరి అజెండా వారి కుండాలి కాని, స్థాపన అజెండా మూలిక ఎవరిక్కావాలి?' ఫలితంగా అది తెలుగు భాషకు సన్మాన పీఠంగా కాక, కళా సన్మాన పీఠంగా మారిపోయింది... అధికార భాషగా నాలుగు ప్రభుత్వ ఉత్తరువులు వెలువడినంత మాత్రాననో, నవీకరణ మీద నాలుగు పరిశోధనా గ్రంథాలు వెలువడ్డంత మాత్రాననో, తెలుగు ఆధునిక ప్రజా భాషగా నిలదొక్కుకోలేదు. ప్రొఫెషనల్ కోర్సుల బోధనల్లో భాగం కావాలి. వారానికి ఒక్క మారైనా ఉస్మానియా మెడికల్ కాలేజీలో, వైద్యరంగంలోని వివిధ అంశాల మీద పాఠాలు, ప్రసంగాలు తెలుగులో జరగాలి. అలాగే వకీళ్లు, ఇంజనీర్లు. అన్ని వృత్తుల వాళ్లు తెలుగు వాళ్లకు తెలుగులో తమ తమ విషయాల గురించి చెప్పగలిగే స్థితి ఉన్నప్పుడే తెలుగు నిలుస్తుంది. 'తెలుగు అమలు' అనే మాటకు అర్థం ఏర్పడుతుంది. తెలుగు విశ్వవిద్యాలయం ఆ దిశలో ఓ నోడల్ ఏజెన్సీ పనిచేయాలి అని చెప్పేవారు. అదో అసంపూర్ణమైన తెలుగు కల... వైజ్ఞానిక దృష్టి ఉన్న తెలుగు అధ్యయన శీలురు, ఆ విశ్వ విద్యాలయానికి పాలకులు కావడం సుదూరంగా నిలిచిపోయే కల.... కవి పండిత వైదుష్యం వేరు, సామాజిక భాషా శాస్త్రజ్ఞత వేరు....

(రచయిత పూర్వ ఉపాధ్యక్షులు, ద్రావిడ విశ్వవిద్యాలయం)

(ఆంధ్రజ్యోతి 'వివిధ' సౌజన్యంతో)

## కథ

# దమ్మ పెబువులు

ఎస్.ఎ. సూర్యజ్యోతి



ఎక్కడో ఆకాశంతో కలసిపోతున్నట్టు కనిపిస్తున్న సముద్రం. సముద్రంలో తుఫానొచ్చింది. వేట ఆగిపోయింది. ముగ్గురు కుర్రాళ్ళు, సముద్రపొడ్డున కూర్చొని, తమ పనిలేనితనం గురించి మాట్లాడుకుంటున్నారు. ఈ తుఫానెప్పుడుకి వొదులుద్దో? ఈ వేటెప్పుడికి మొదలౌద్దో?

"దేముడు పెట్టిన తుఫానైతే గడువుంతదిగానీ, మనిషి పెట్టిన తుఫానుకి గడువుంటదా?"

"ఈలకేటి పోగాలం దాపురించిందో? మర పడవలన్నీ ఒడ్డుకి చేరేస్సినారు. చేపలన్నీ మింగేసిందీళ్ళే కదా? మరిప్పుడు కిట్టట్లేదని వేట మానేసి మనల్ని వస్తులెట్టస్తన్రు"

అందులోమరొకడందుకొని "మన అసిరయ్య గనమైనోడ్రా, మన వోటా ఎగమెడ్డీదానికి, మర పడవోడు సూత్తుంతే, మా వోటా మాకివ్వకుంటే కుదరదని నిలబడిపొండు"

పెద్ద చేపల్ని ఆడుతీసుకొని మర పడవమీద మిగిలే సిన్నా సితకా చేపలు మనకిచ్చే ఆసారానికి ఆడ్డుగోలేసి మరీ కక్కుర్తికి దిగజారిపోయి ఈటిని కూడా పట్టుకుపోవడానికి సూత్తన్నాడు. వొల్లకాదంటే వొల్లకాదని అసిరయ్య మనోళ్లందర్ని నిలబెట్టేసాడు.

"మరి ఆడు మాత్రం తక్కువోడేటి? సోనా బోట్లన్నీ ఒడ్డుకి కట్టేసి ఉంచేసినాడు. ఎలాగ తేలుద్దో ఏటో సివరకి గంగమ్మ తల్లిదే బారం"

అందుల ఒకడైన చిన్నయ్య "ఎలగూ ఏట లేద్రా రంగా, మావూరు రమ్మంతే ఎప్పుడ్రావు, మా వూరెల్లెద్దుమురా?"

"ఇంతకీ నీవూరేదిరా?" అడిగాడు కిష్టుడు

"మావూరు, సముద్రపొడ్డు "పాలెమే" అన్నాడు.

"అయితే పదరా మీవూరెల్లిపోదుము" అన్నాడు రంగడు

"అందరమెల్దుము రాకూడదేట్రా?" అన్నాడు చిన్నయ్య

అలాగ చిన్నయ్య, రంగడు, కిష్టుడు, పాలెం బయలుదేరారు.

ఉదయం విశాఖపట్నంలో బయలుదేరిన మిత్రులు మధ్యాహ్నం కన్నా ముందుగానే పాలెం చేరారు.

పాలెం, రోడ్డుకి దూరంగా, సముద్రంకి కాస్త దగ్గరగా ఉన్న గ్రామం. ఊరన్నాక 12 కులాలన్నట్టు, 12 కులాలు ఉన్న వూరది. ఊరి మొదల్నుంచి ఊరిచివరి దాకా, సరుగుడు తోటలే కనబడుతున్నాయి.

ఊరు, ముసలివాళ్లతోటి, పిల్లలతోటి మురిసిపోతోంది.

ఊరి మొదట్లోనే ఒక విగ్రహం. అది దేవుడిదైతే కాదు. ఊరి మొదట్లోనే విగ్రహం ఉందంటే ఆ మనిషెవడో గొప్పవాడై యుండాలి. విగ్రహం మీద ఆ మనిషి పేరు, విగ్రహం పెట్టిన తేది, విగ్రహం ఆవిష్కరించిన పెద్దల పేర్లు స్పష్టంగానే రాసి ఉన్నాయి. రంగడు విగ్రహాన్ని చూసి, ఈ 'జొన్నాడ హరిశ్చంద్రరెడ్డి' అంటే ఎవర్రా అని అడిగాడు.

"సూత్తన్నావు కదా, వూరు మొదల్నుంచి చూస్తున్న సరుగుడు తోటలు. ఈ సరుగుడు తోటల వరస సముద్రం వరకు సాగుతూనే ఉంటది. ఈ తోట్లన్నీ ఆ విగ్రహం మనిషి కుటుంబం వాళ్లవే"!

"ఓసోస్ అన్ని తోటల్రా, అంత భూమిరా ఈలకీ, మరి మీకేటి తోటనేదురా?"

చిన్నయ్య చిద్విలాసంగా నవ్వుతూ "తెద్లన్నీ మనవేన్రా, తోట్లాలవి".

"మరింతకీ ఇన్ని భూములు, ఆ ఇగ్రహం మనిషికి ఎలా ఒచ్చేసేయిరా?"

ఒరే, నన్ను చంపకురా, ఇంటికెల్లాక, మా అయ్యనడిగితే, నీకు రాత్రి వరకూ పురాణ కాలచ్చేపం.

"ఓసే, రమ్మన్నావు. అడిగితే ఇలాగిసిగిపోతామేమిరా? అన్నాడు కిష్టుడు.

ముగ్గురు మిత్రులూ, ఊరికి దూరంగానూ, సముద్రంకి దగ్గరగానూ ఉన్న వాడ బలిజ వీధికి చేరేరు. వీధి, సిమెంటు రోడ్డుతో కళకళలాడుతోంది. రోడ్డు మీద టేకిలి, కవ్వళ్ళు, నెత్తళ్లు, ఆభరణాల్లా మెరుస్తున్నాయి. నైలాను వలలు, రోడ్డుమీద ఆరబెట్టి ఉన్నాయి. ఆడవాళ్లు, చేపలను రకాలవారీ సద్దుతున్నారు. అలవాటైన చేపల వాసనే కాకుండా ముక్కుపుటాలదిరిపోయేలాగ గత్తర వాసన ముగ్గురు మిత్రులకి తగిలింది.

కిష్టుడు, "పసందైన మన చేపల వాసనకి తోడుగా ఈ గత్తర వాసనేట్రా?" అని అడిగాడు.

అదా "ఇక్కడి సముద్రపొడ్డునే పడమటి రెడ్డి గారి మందుల ఫ్యాక్టరీ కట్టేరు. ఇక్కడి మందులు, అమెరికా వరకూ పోతాయట"

"ఓ, మన వొయిజాగు చేపల్లాగన్నమాట" అన్నాడు కిష్టుడు.

ముగ్గురు మిత్రులూ మాట్లాడుకుంటూ, ఇంటికి చేరేరు.



ఇల్లంటే ఇటికెలూ, సిమ్మెంటూ కాదు. భూమికి వర్తులాకారంగా వేసిన గుడిసె. గుడిసంతా ఒకటే గది. రోడ్డు ఎత్తులోని, గుడిసె పల్లంలోనూ బాగా వంగి, గుడిసెలోపలికి మిత్రులు ముగ్గురూ దూరేరు. లోపల చిన్నయ్య వాళ్ల అమ్మ గంగమ్మ వంట చేస్తోంది.

"అయ్యేడమ్మా?" అడిగాడు చిన్నయ్య

"ఇప్పుడే ఈదిలోకెల్లేడు గాల"

చిన్నయ్య మిత్రుల్ని అమ్మకి పరిచయం చేశాడు.

ముగ్గురూ కొంతసేపు సేదతీరి, భోజనం చేసి, నిద్రలో పడ్డారు. సాయంత్రం నాలుగు గంటలకి, ముగ్గురూ ఊర్లొకి బయలుదేరారు. చిన్నయ్య తన మిత్రుల్ని ఊర్లో తన చిన్ననాటి స్నేహితుడి ఇంటికి తీసుకెళ్లాడు. స్నేహితుని గురించి వాకబు చేస్తే, అతని తండ్రి "గణేశు ఫేక్ట్రీలో పనికెళ్లాడు. ఊర్లోని నీలాంటి కుర్రోల్లు సగం మంది, పనికోసం పట్నం ఎల్లిపోతే, మిగతా సగంమంది, ఈ ఫాక్ట్రీలో డెయిలీ లేబరుగా కుదిరిపోయారు".

గణేశ్ తండ్రి వెంకట్రావుకి, తన మిత్రుల్ని, మిత్రులకి గణేశ్ తండ్రిని పరిచయం చేశాడు. ఆ మాటా, ఈ మాటా అయిన తర్వాత రంగడు అనబడే రంగారావు, "ఇంతకీ ఆ ఇగ్రహం కథేటండీ?, ఆ ఇగ్రంలోని, మనిషెవరు?" అంటూ ప్రశ్నలు గుప్పించాడు.

"సదవనేదేటి, ఇగ్రహం మీద పేరు? ధర్మాత్ముడు జిల్లాలు జిల్లాలు పేరు మోస్సినడు. దేశదేశాల సాదువులు, సంక్రమానమొచ్చిసరికీ, ఈ వూరు పాఁరావలసిందే. నెలగంటు పెట్టిన మొదలు, సంకురాత్రి అయ్యావరకూ పెజలే పెజలు."

"ఎందుకు?"

"దేశమంతా, టముకయిపోయాది. ఎక్కడెక్కడ సాదులూ ఒచ్చేయాలని, రెడ్డిగారు పురమాయించేసివోలు. వొచ్చినోలందరకీ, ఊరి చివర పేద్ద దేరాలేస్సి ఉంచేసీవోలు. దేరాల్లోనే బోయినాలు. వొచ్చినోలందరికీ వస్త్రదానాలు. ఆ జాతర నెల్రోజులు సాగేది."

"అంత దానాలు చేయడానికి అంత ధనవంతుడా?" ఉత్సుకతతో అడిగాడు రంగడు.

"ధనంకేటి లోటునేదు "వల్లెటూర్లో అంత ధనవంతుడెలాగయ్యాడు"

"అదో పెద్దకథ సెప్పాలంతే రాత్రయిపోద్ది" అన్నాడు

రంగడ్లో మరింత ఉత్సాహం పెరిగి "కథ మొదలెట్టండయితే" అన్నాడు.

వెంకట్రావు కథ చెప్పడం ప్రారంభించేడు. "రెడ్డిగోరు ఓ ఏడెనిమిదెకరాల రైతు. రైతురికంతోటి ఆగిపోతే ఏటున్నాదని వ్యాపారంలోకి దిగాడు. ఊరు, ఊరు పోలాలన్నీ ఏరుశెనగ ఏసోలిమి. ఈ ఊరికి దగ్గర్లోనే పొందూరు నూని మిల్లుకి కాయలన్నీ పట్టికెల్లోలిమి, ఇప్పుడ్నాగేటి, పొందూరెల్లడమంతే, సెనక్కాయలు తీసుకెల్లాలంతే బక్కలు, బళ్లూ ఉండాల. తీరా తీసుకెల్తే, నాదరు రైతులంటే షావుకారుకి సులకన. ఆడిష్టమొచ్చిన తూకం తూచి, ఆడిష్టమొచ్చిన ధర కట్టోడు. ఇది చూసిన రెడ్డి, మీకెందుకర్రా ఈ బాధలు, నాకే అమ్మేయండి. ఈ కాయలన్నీ, నా బాధలేవో నేను పడతానన్నాడు."

"మాకీ తిప్పలు లేకుండా చేసాడు. అయితే మంచోడే" అన్నాడు కిష్టుడు

"ఆ మరదే ఇను"

"ఇప్పుడ్నాగ, అపుడిన్ని బేంకీల్లేవు. ఓ సొసైటీ ఉండేది. అదిచ్చిన నోన్లు పొదుగుసేతులోలికి అందేవి. పంటలకేకాక, ఇంకేకర్చు, కరంకి రైతుకి అప్పే గతి. ధరమపెబువు దగ్గరికి ఇప్పుడెల్లినా, చేతికి ఎముకలేకుండా అప్పు ఇచ్చోడు. కిట్టనోలు ఏదో అనుకుంటరు. పుట్టికి పందుం పాయిదా నాగివోడు కదా అని."

"పుట్టికి పందుం పాయిదా అంటే ఏటి?" అడిగాడు కిష్టుడు.

"అంతే, అప్పుడిగినప్పుడు, పుట్టిడు కాయలకి సరిపడా డబ్బు ఇస్తే, పంట అమ్మినపుడు పుట్టికి పందుం కాయలివ్వాలని."

"వోరి నాయినా సాలా అన్యాయం"

"అన్నేయం అంతే, ఆమాత్రం అప్పిచ్చిన మొగోడు, ఈ సుట్టుపక్కలేడి? జబ్బొత్తే, జరమొత్తే పశువుకైనా, మనిషికైనా, ఆ దరమపెబువే ఆదుకునోడు కదా."

"అయితే మరి తరవాతేటయింది."

"ఏటొతది, ఎక్కడైనా అదే కథ. పాయిదాలు కొలవడానికి సెమించిపోనం. పాయిదాలు కిందకే మానాటోలి బూములన్నీ కరిగిపోనాయి. అయితేటి, పాయిదాలు కొలిచే బాద తప్పించేసినాడు దరమపెబువు. ఊరు సగంమంది రైతులం ఆ భూముల్లోనే కూలీలైపోనాం.

"అయితే అందరి భూములూ పోయేయా?

"స్తితిమంతుల భూములు తప్ప ఎక్కువ, తక్కువ అందరి భూములూ, ఎంతోకొంత పోనాయి"

"మరి అతనా భూముల్తో ఏటి సేసేడు?"

"ఏరుసెనక్కాలేసీ వోడు. అతని భూముల్లోకి సెనక్కాయలు, మండలం, మండలం సెనక్కాయలు, ఇక్కడినుంచి పొందూరు మిల్లుకి మోసిపోయినట్లు నాటు బళ్లను తోలించోడు. తర్వాత ఎలచ్చన్ల నిలబడ్డాడు. సొతంత్రంగా ఎమ్మెల్యే అయినాడు. అప్పుడ్నుంచి దానాలు పేరంబించాడు. ఎక్కడెక్కడోలు ఒచ్చిదానం తీసుకునేవోలు. ఎమ్మెల్యేగుండగ సచ్చిపొండు. ఇగ్రహం నాగా నిలబడ్డాడు".

"మరి అతని పిల్లలు ఏమయ్యారు"

అతని కొక్కడే కొడుకు. హరిరెడ్డి. అతన్ని కూడా తండ్రి లేని బిడ్డ అని పెజలందరం నిలబెట్టి ఎమ్మెల్యే చేసినం. "అతడు ఎమ్మెల్యే అయి హైదరాబాద్ వరకూ వెళ్లొచ్చీవోడు. ఊర్లో పొలాలన్ని వేరుశెనగేసేవోడు. తండ్రిని మించి వ్యాపారం చేసేవోడు" "అపుడు మన వూర్లో వరి పండేది కాదా? వరి ఎందుకు తక్కువేసే వోళ్లం'' చిన్నయ్య సందేహం వెలిబుచ్చాడు,. "వరికి నీరు వుండాలికదా! ఊర్లో ఆ ధర్మాత్ముడు తవ్వించిన చెరువు అతని పొలాలకే సరిపోయింది. అతను ఇంత పొలం సంపాదించినా నీరు మాత్రం ఒచ్చేది కాదు. అందుకే అతనూ, అతనితోపాటు మేమూ వేరుసెనగ వేసేవోలిమి"



ఈ ఊరికి నీరు వచ్చే మార్గం లేదా? అడిగేడు గోదావరి జిల్లా కాలువభూముల్లో పెరిగిన క్రిష్టుడు.

''పెతి ఎన్నికలప్పుడు కొలతలు తీయించేవోడు మా హరిరెడ్డి. ఇదిగో కాలువ. అదిగో నీరు అనే చెప్పేవోడు. ఒకరోజు నేను కొంచెం చనువుతోటి హరిరెడ్డిని రెడ్డిగోరు ఎప్పుడూ కొలతలేనా? నీరొస్తదా అని అడిగెను. రెడ్డిగారు ఫకాలున నవ్వి "ఒరే వెంకట్రావూ! కులపోడివి కాబట్టి సెప్తున్నాను. నీరొత్తే, పంటలు పండేత్తే ఈ రైతులు మన మాటింటార్రా? ఓట్లప్పుడే కాలువా వొస్తాది! నీరు వొస్తాది" అని రహస్యం కాస్తా చెప్పేడు.

"రాన్రాను వేరుసెనగా కిట్టడం మానేసింది. దీనితోటి రెడ్డిగోరు ఏటిసేయాలా అని ఆలోసిత్తంటే రాయిగడ పేపర్ మిల్లోడు వచ్చి మొక్కలిస్తాను, అప్పులిస్తాను. సరుగుడు చెట్లూ నేనే కొంటాను. కిట్టుబాటు ధర ఇస్తాను అని చెప్తే రెడ్డిగోరు తన భూవులన్నింటా సరుగుడేసినాడు. అసలుకారణమేటంటే కూలోలు తెలివి మీరిపోవడంతో సరుగుడు చెట్టేసినాడు. హరిరెడ్డి "అదిగో అలాగ మీరు సూచిన తోటల్ని రెడ్డిగారు, రాయిగడ పేపరిమిల్లోడు కలిసేసినవే"

"మరి మీ పొలాలు" అడిగేడు రంగడు.

"కోరిన ఉన్నవి కొన్రిన ఉన్నాయి. లేదంటే మేమూ టేకు, సరుగుడు, మామిడి ఏసినాము.

"కూలోల్లో ఇదే అదనని జారిపోయి పట్నాలుపట్టీసేరు. దీనితో మావూ సరుగుడు తోటలూ, సబాబులో ఏసీనం"

"హరిరెడ్డి పోయిన తర్వాత అతనిద్దరూ కొడుకులు తలకట్టేరు. పెద్దోడు పెతాపరెడ్డి, చదువు అబ్బలేదు. ఊర్లోనే సరుగుడు తోటలు, వ్యాపారం చూస్తాడు. రెండో కొడుకు పెద్ద సదువులు సదివి విదేశాల్లో పెద్ద ఉజ్జోగాలు చేసి ఊరిని కాపాడాలని ఊర్లోకొచ్చాడు, పేరు విక్రమరెడ్డి.

"మరి ఊర్లోకొచ్చిన విక్రమరెడ్డి ఏంచేసారు?" క్రిష్టుడడిగేడు.

''అతను ఊర్లోకొచ్చి చూసేసరికి ఊరంత తోటలు అయిపోనాయి. ఊర్లో సగం మంది వలస పోవాల్సిన గాసారం వచ్చిందని బాధపడిపోయాడు. మనకేటి ఈ కర్మ. మనమే ఫ్యాక్టరీ పెడితె మనూరు కుర్రోలందరూ మన కళ్లముందటే వుంటారని పెద్దోల్ని పిల్లల్ని, కూడేసేడు. పడమటి రెడ్లతో జట్టుకట్టి ఆ మందుల ఫ్యాక్టరీ తెచ్చాడు. ఆ ఫ్యాక్టరీలో ఆ బాపు డైరెక్టరయితే మన కుర్రోల్లు కళాసీలు, సీపర్లు అయ్యారు" అని ముగించాడు.

''గణేశు ఇంకా రాలేదేటి? అయితే ఎల్తామయితే"

తిరిగి తిన్నగా ముగ్గురు మిత్రులు, వాడబలిజ వీధికొచ్చారు. ముగ్గురు ఇంటికి చేరేసరికి చిన్నయ్య వాళ్ల అమ్మ, ఐసుపెట్ట బయటకి తీసి, అందులోంచి వొంజరాలని తీసింది.

"ఏటమ్మా వొంజరాలు కూడా సెల్లలేదా? అన్నాడు చిన్నయ్య

"కార్తీమాసం, అయ్యప్ప సోములు, భవానీ బత్తులూ, అందరూ బామ్మర్లయిపోన్రు.

సేపలు సెల్లకుంతన్నాయి" అంటూ నిపుణుడైన డాక్టరు శాస్త్ర చికిత్త చేసినట్లు, గంగమ్మ వొంజరాన్ని నిలువుగా రెండు ముక్కలు కోసింది. ముక్కల్లో ఉప్పు వేసి, రెండు ముక్కల్ని అతికించి పెట్టింది. మొత్తం వొంజరాలన్నింటిని ఇలా చేసి, ఓ పక్కకి సద్ది, "ఎప్పడికాంచో కోల్డు స్టోరేజీలు పెట్టమని అడిగినా ఈ గవర్నమెంటు పట్టించుకోనేదు. ఓట్లప్పుడు కనబడతాం మరెప్పుడూ గేపకమేరాం. ఎంతైనా, పచ్చిసేపకున్న ఇలవ, ఎండు సేపకుంతదా'' అని నిట్టూర్చింది.

"నెంగడి, నెంగడి, బువ్వలకి ఏలవ్వనేదేటి? కసింత తినేసి, పడుకుందుం. ఉదయాన్నే బుట్టొట్టుకొని, బయలెల్లాలి. మీ అయ్య ఎక్కడ తిరగుతండో ఏటో. చిన్నయ్యా, మీ అయ్యని కేకేసుకురమ్మి."

చిన్నయ్య బయలుదేరి, తుఫాను షెల్టరు దగ్గర, తన ఈడు వాళ్లతో మాట్లాడుతున్న దుర్యోధనుడ్ని తీసుకొచ్చాడు. అందరూ అన్నాలుతిని గంగమ్మ గుడిసెలోపల పడుకుంటే, మిగిలిన వాళ్లంతా బైట చలిలోనే పడుకున్నారు.

తెల్లవారి అయిదుగంటలకే తీవ్రమైన దగ్గు రావడంతో క్రిష్టుడికి మెలకువ వచ్చింది. మెలకువ వచ్చిన తర్వాత కూడా ఊపిరాడనట్లుగా దగ్గుతో సతమతం అయ్యాడు. మిగతావారు ఈ దగ్గుతో మెలకువ వచ్చి, వారంతా క్రిష్టుడ్ని "ఏమైంది? ఎందుకు దగ్గు వస్తోంది.? అని

ప్రశ్నిస్తూనే వాళ్లు కూడా తరతమ స్థాయిలో ఊపిరాడనట్లుగా ఉక్కిరి,బిక్కిరి అవుతున్నారు.

ఆకాశం దట్టంగా మబ్బుపట్టింది. ముక్కుపుటాలదిరిపోయేలా దుర్గంధం వ్యాపించడంతో వాళ్లు ఉక్కిరిబిక్కిరి అవుతున్నారు.

"నాయనా! ఏట్రా ఈ వాసన. మా విశాఖపట్నం పోర్టు దగ్గరకన్న ఈ పక్కకిబడి పల్లెటూరు ఇలా అయిపోయింది" అని చిన్నయ్య దగ్గుతూనే వాళ్ల నాన్న దుర్యోధనుడ్ని అడిగాడు.

"ఫ్యాక్టరీ వోసనేరా! చలికాలంలో ఇంకా ఎక్కువైపోతాది. వేసవికాలంలో మన వరకూ కనిపించదు గానీ చలికాలం వత్తే ఈ వోసన మన ఊరివోల్లని పట్టి పీడించేత్తది"

ఇలా అనుకుంటూనే కాలకృత్యాల కోసం సముద్రపొద్దుకి నలుగురూ చేరారు.

సముద్రపొద్దుకు చేరేసరికి వాళ్లకి విషాదకరమైన దృశ్యం ఎదురైంది. సముద్రపు జలాల్లో ఆలివ్‌రిడ్లీలు, పాలపుంతలు సముద్రపు నురుగులో కలిసిపోతూ తేలుతున్నాయి. అవన్నీ చచ్చిపడున్నాయి.



ఇది చూసిన రంగడు

''పెదనాన్నా! ఇక్కడ కూడా ఇవి చచ్చిపోతున్నాయా? ఇలా ఇక్కడ ఎప్పుడు నుంచీ జరుగుతోంది. విశాఖపట్నంలోనే తాబేల్లు, పాలపుంతలు చచ్చిపోతున్నాయి అనుకున్నాం. ఇక్కడ కూడా ఇలాగేనా? ఇలాగయితే మన బతుకేంటి?"

"మరిలగే గడుస్తుంది. మరి పొట్ట గడవకే కదా, మూడొందలు కట్టమారం పడవల్తోటి సాగి వేట, ఐదు పైబరు బోట్లకొచ్చేసింది కదా! కట్టమారం పడవలు ముప్పైకొచ్చేసినయికదా, ఇక్కడ వేట తగ్గిపోయి, గుజరాత్, గోవా వరకు మనోల్లేకదా" అని సమాధానమిచ్చాడు. అందరూ కాలకృత్యాలు తీర్చుకొని, తిరిగి ఇంటికి చేరారు.

కొంతసేపటికి "ఏటొచ్చేసింది, ఏటొచ్చేసింది. సేపలు బాగానే పడినాయట" అంటూ పదేళ్ల కుర్రోడు, రివ్వున వీధిలో పరుగెట్టడం ప్రారంభించాడు.

దుర్యోధనుడితో పాటు ముగ్గురూ, సముద్రపొద్దుకు బయలుదేరారు. అప్పుడే మత్స్యకారులు, ఫైబరు బోట్లను ఒడ్డుకు తీసుకొచ్చి, వలలోకి వెదురు బొంగులు దూర్చి, చేపల్ని తీసుకెల్తున్నారు. ఎక్కడెక్కణ్నుంచో వచ్చిన షావుకార్లతో ఒడ్డంతా కోలాహలంగా ఉంది. మత్స్యకారులు జాగ్రత్తగా చేపలని, వంజరాలు, వోల, కోనెం, కానాగడత, మెత్తనిసొర, గురిబంద, జెల్ల, హార, కదారి, శీలవతి, తలేపార, ఇలాగ రకరకాల వారీగా సద్దేరు. ఏ బోటు వాళ్లు వేటాడిన చేపలని, ఆ బోటు వాళ్లు రకాల వారీగా చేపలని కుప్పలుగా పోసారు.

చేపల వేలం ప్రారంభమయ్యింది.

వేలందార్లతో పాటు, ప్రతీవేలం దగ్గర, ప్రతాపరెడ్డి ఏజెంట్లున్నారు. వేలం పూర్తయిన తర్వాత ప్రతీబోటుకి వచ్చిన డబ్బులో 15 శాతం ప్రతాపరెడ్డి ఏజెంట్లు వసూలు చేయడం కిష్టుడు గమనించాడు.

"పెదనాన్న, ఈల్లెవరు? ఇలా ప్రతీ బోటు దగ్గర 15 శాతం వాళ్ళెందుకు తీసుకుంటున్నారు. వాళ్లకి వేటలో వాటా ఉందా?" అన్నాడు.

"నీకు తెలీనిదేటుంది. పైబరు బోటు కరీదు కదా, అందుకని 20 ఏసి మందిమి ఓ బోటు కొన్నాం. అందుకని, మనూరు మొదలు ఇగ్రహం ఉందికదా, ఆ ఇగ్రహం మనవడు, ప్రతాపరెడ్డి, పైబరు బోట్లన్నిటికీ డబ్బులిప్పిస్తాడు. ఆ అప్పుకి వడ్డీకింద రోజూ వచ్చిన వేటలో 15 శాతం ఇవ్వాల."

"ఆల తాతకన్నా అన్నాయం లాగుందిది" అన్నాడు కిష్టుడు.

"అన్నాయమేటుంది. బూర్జికర్ర పడవలున్నప్పుడు, దగ్గిర, దగ్గిరకే ఎల్తనము, ఎక్కువ సేపలు పడవు, పైబరు బోట్లయితే ఏట ఎక్కువ పడిపోద్ది అని పైబరు బోట్లకెల్లమన్నారు. మరి ఆ పైబరు బోట్లకి డబ్బులెక్కడివి. మల్లీ ఆ దమ్మపెబువే కదా ఇచ్చినాడు"

"మరీ ఇంత వడ్డీ అన్నాయం కదూ, రోజూ ఇవ్వాలా"

"మరెప్పుడూ వాజీబు అదే. ఈ ప్రతాపరెడ్డి ఆల నాన్న హరిరెడ్డి ఉన్నప్పుడు కూడా అదే."

"అయితే మూడు తరాల వాళ్లూ ప్రజల్ని ఆదుకున్నవాళ్లే అన్నమాట'

''మరికాదేటి? హరిరెడ్డి ఆల నాన్నగారున్నప్పుడు సముద్రంకేసి సూసోడుకాదు. రోగమొచ్చినా, రోష్టొచ్చినా తుఫానుకి పడవలు కొట్టుకెలిపోయినా, అప్పుకోసం చీపురుపిల్లో, శ్రీకాకులమో ఎల్లోలిమి. ఆలు వడ్డీ మూడొంతులుల్లో ఒక వొంతు సేపలు తీసుకునేవోలు. ధర్మపెబువు హరిరెడ్డి తలకట్టి "ఒరే, ఒరేయ్ అప్పులు కోసం అంత దూరమేట్రా, నేను లేన్రా ఊర్లోని, నాలుగోటాలకీ, ఒక వోటా సేపలకే నేనప్పులిస్తానని, అప్పులివ్వడం పేరంబించినాడు"

"ఓహో! మీ కష్టాలు కొంచెం తీరేయి అయితే"

అర్రె అలగంతావు, మొదలైనాయి. మా కట్టమారం బోట్లు పనికిరావు, పైబరు బోట్లయితే పనికొస్తాయి అని గవరమెంటు. మా సొసైటిలో కొనగలిగినోలికి పావలా వోటా సబ్సిడీ మీద రెండు పైబరు పడవలిచ్చారు. ఒక తుపాను దెబ్బకే రెండు ఫైబరు బోట్లూ మూలన సేరిపోనాయి. అప్పోసొప్పో సేసి మొత్తానికి ఇప్పుడు మా ఊర్ల 5 పైబర్ బోట్లైనాయి.

''అయితే మంచిదె కదా పైబర్ బోట్లయితే కొంచెం దూరమెల్లొచ్చు. ఏట కూడ పడద్ది."

"నిజమే" అన్నాడు రంగడు.

"పైబరు బోటు లేనప్పుడు 300 మంది ఏటకెల్లోలిమి. అయితే ఇప్పుడేటి అందరం ఏటకెల్తన్నాం గాని సగం మందిమి కూలీలుగా

# పురావస్తు పరిశోధకుడు వి.వి. కృష్ణశాస్త్రి కన్నుమూత



పురావస్తు చారిత్రక అంశాల పరిశీలనలో విశేష కృషిచేసిన ప్రముఖ పరిశోధకుడు వి.వి. శాస్త్రి ఆగస్టు 22న తుదిశ్వాస విడిచారు. రాష్ట్ర పురావస్తు శాఖలో మ్యూజియం, పురావస్తు శాఖ డైరెక్టరుగా పనిచేసిన వేలూరి వెంకట కృష్ణశాస్త్రి కృష్ణాజిల్లా చిరివాడలో 1934 అక్టోబర్ 23న జన్మించారు. గుడివాడ కళాశాలలో డిగ్రీ, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పి.జి. చేసారు. కర్ణాటక విశ్వవిద్యాలయంలో పి. హెచ్.డి.పూర్తిచేసుకుని ఆర్కియాలజీ సర్వే ఆఫ్ ఇండియా తరపున నాగార్జునకొండలో 1961లో స్కాలర్ ట్రెనీగా ప్రవేశించారు. అప్పటి నుండి పురాతత్వ పరిశోధనల్లో ఆయన చేసిన కృషిద్వారా గుర్తింపు పొందారు. ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ ప్రదేశాలలోని చారిత్రక కట్టడాలకు సంబంధించిన కొత్త విశేషాలను వెలుగులోకి తీసుకొచ్చారు.

రాష్ట్రంలోని ప్రకాశం జిల్లా చందవరం, గుంటూరు జిల్లా కీసనపల్లి, ధూళికట్ట, కరీంనగర్ జిల్లలోని కోటిలింగాల ప్రాంతాల్లో ఆయన తవ్వకాలు జరిపి బౌద్ధ క్షేత్రాలను గుర్తించారు. క్రీ.శ. నాలుగైదు శతాబ్దాల మధ్య శాతవాహనులు పాలించిన సమయంలో ఆంధ్రప్రదేశ్‌ను ఏలిన విష్ణుకుండినుల రాజధాని రంగారెడ్డి జిల్లా కీసరగుట్ట అని నిరూపించారు. కొత్తరాతి యుగం చివరి దశకు చెందిన గంగాతీర సంస్కృతి తెలుగు నేలపై పాకిందనేందుకు తగిన ఆధారాలను బెల్లం గుహల తవ్వకాల సమయంలో ఆయన సేకరించారు. ఆయన నేతృత్వాన అమ్రాబాద్, మన్ననూర్, దేవరకొండ, ఏలేశ్వరం, గోదావరి తీర ప్రాంతాల్లో సాగిన తవ్వకాలలో ఆదిమానవుల అడుగు జాడలను గుర్తించారు. పురావస్తు పరిశోధనలు శీర్షికతో ఆంధ్రజ్యోతి పత్రికలో ప్రచురించిన ఆయన వ్యాసాలు అందరి ప్రశంసలూ పొందాయి. శ్రీశైలం డ్యామ్ నిర్మాణ కారణంగా ముంపుకు గురైన వందకు పైగా ఆలయాలలోని శిల్పసంపదను గున్‌ఫౌండ్రిలోని పురావస్తుశాఖకు తరలించి 'శ్రీశైలం పెవిలియన్'ను ఏర్పాటుచేశారు. 'ప్రోటో హిస్టారికల్ కల్చర్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్' అనే వీరి పుస్తకాన్ని క్వీన్ ఎలిజెబెత్-2 తన భారత పర్యటన సందర్భంగా 1982లో ఆవిష్కరించారు. తవ్వకాలు, నాణేలు, శాసనాలు వంటి అంశాలపై సుమారు వందకు పైగా పుస్తకాలు రచించారు. 1992లో పురావస్తు శాఖ నుండి పదవీ విరమణ చేశారు. అనంతరం హిస్టారికల్ సొసైటీ ఆఫ్ హైదరాబాద్‌కు అధ్యక్షుడుగా ఉన్నారు.

---

ఎల్తన్నాం. అయితే ఇక్కడితో ఆగిందా, ఆడి తలదన్నేవోడు ఒకడు. ఇప్పుడివేటి కాదని ఆ సోనాబోట్లోచ్చేసినయి. వైజాగు ఒడ్డు నుండి పరదీపు దాటి ఇంకెటుగాంచో. ఎక్కడెక్కడి చిన్న సేపతో పాటు సేపగుడ్లని కూడా వొదల్లేదు. ఎక్కడెక్కడ్నించో వస్తున్న సోనా బోట్లు సముద్రాన్ని బురదసేసేస్తున్నాయి. ఆఖరికి బాతు బంగారు గుడ్డు కతౌతంది. మా అయ్య సూసినన్ని సేపల రకాలు నేను సూడ్లేదు. నేను చూసినవి మీరు సూడరు. ఆకరికి సేప సముద్రం మీద నుంచి భూమ్మీదకొచ్చి పడుతంది. ఈ సముద్ర పొడ్డల్లా ఆ హరిరెడ్డి కొడుకు పతాపరెడ్డి సేపలు పండిస్తండు. మావోడు ఆ సోనాబోట్లోకే పనికిపోనారు. ఆడు పంపించిన పైసలే నాకాదారమౌతన్నాయి"

"ఏ దేశమేగినా, ఎందుకాలిడినా,..." రింగుటోనుతో రంగడి ఫోను మోగింది.

"ఒరేయ్ ఎటెల్లిపోనార్రా. సెప్పాపెట్టకుండా ఎల్లిపోతారేట్రా? తుఫానొగ్గేసింది. ఏట మొదలైపోద్ది రేపట్నుంచి, బేగి పొర్రండి."

"అయితే మన డిమేండ్లకి అడొప్పుకున్నాడా? రేపొదయాన్నే బయలుదేరొచ్చేత్తాం"

మరుసటిరోజు తెల్లారే లేచి మిత్రులు ముగ్గురూ బయల్దేరారు. గంగమ్మ చేపల కూర కారెజీ కొడుకు చేతిలో పెట్టి లేకలేక పుట్టావు. చిన్నోడని పేరుపెట్టి మురిసిపోనాం. గంగ ఒడ్డునే బ్రతికేగలమనుకొన్నాం గానీ గంగ మనది కాకుండైపోనాది. ఎవులో పెట్టిన బోటుల్లోకి పనికెళ్లి, రెక్కలు ముక్కలు సేసుకొని నువు పండించే డబ్బు మాకాధారమైపోనాది. సముద్రపు దొంగలెవురో తెలీనేలేదు కానీ సముద్రంలో రాజువౌతనాంటే కూలిలైపోనాం" అని కళ్లనీరు తుడుచుకుంది.

"ఓలమ్మా! వల్లకోమే. చరిత్రంతా రాత్రి ఇన్నాను కదా! సముద్రంలో రాజు అయినా, కూలీ అయినా మనకేటీ, ఏనాడూ మిగల్నేదు" అన్నాడు చిన్నయ్య.

ముగ్గురూ ఊరిమధ్యలోకి వచ్చేసరికి పెద్ద, పెద్ద బ్యానర్లు కడుతున్న వాళ్లు ఎదురయ్యేరు.

మత్స్యకారుల పిల్లలకు నోట్‌బుక్స్, యూనిఫారాలు, పంపిణీ "పడమటి రెడ్డిగోరి కంపెనీ డైరెక్టర్ విక్రమ్‌రెడ్డి పేరుతో ఉన్న బ్యానర్లను రంగడు చదివాడు.

"ఓరే! చిన్నయ్యా! ఇతను కూడా ధర్మ పెబువేన్రా"! అంటూ నవ్వులకు లంకించుకున్నాడు.

♦



కాపు రాజయ్య　　　　కొండపల్లి శేషగిరి రావు

# ఒకరిది సంప్రదాయం మరొకరిది జానపదం

గుడిపూడి విజయరావు

*ఆధునిక శైలిని అనుసరిస్తూనే సంప్రదాయాన్ని కొనసాగించిన కొండపల్లి శేషగిరి రావు, జానపదశైలిలో చిత్రిస్తూనే ఆధునిక చిత్రకళాకరంగంలో తిరుగులేని స్థానం సంపాదించిన కాపు రాజయ్య. వీరు జన్మించింది కూడ ఒక్క ఏడాది వ్యత్యాసంలోనే. ఇరువురు కడు పేదిరకంలో నుండి స్వయంకృషితో, పట్టుదలతో ఉన్నత స్థానానికి ఎదిగిన వారే. ఇరువురు తెలంగాణాకు చెందిన వారే. కాని వారు ఆంధ్రులందరి సొత్తు. దేశంలోనే కాదు, విదేశాలలో సైతం వారి కళకు చక్కటి ఆదరణ, అభిమానాలు లభించాయి.*

ఆంధ్రదేశం ఇటీవల కొద్ది వారాల వ్యవధిలో ఇద్దరు అగ్రశ్రేణి చిత్రకారులను కోల్పోయింది. వారు ఆధునిక శైలిని అనుసరిస్తూనే సంప్రదాయాన్ని కొనసాగించిన కొండపల్లి శేషగిరి రావు, జానపదశైలిలో చిత్రిస్తూనే ఆధునిక చిత్రకళాకరంగంలో తిరుగులేని స్థానం సంపాదించిన కాపు రాజయ్య. వీరు జన్మించింది కూడ ఒక్క ఏడాది వ్యత్యాసంలోనే. ఇరువురు కడు పేదిరకంలో నుండి స్వయంకృషితో, పట్టుదలతో ఉన్నత స్థానానికి ఎదిగిన వారే. ఇరువురు తెలంగాణాకు చెందిన వారే. కాని వారు ఆంధ్రులందరి సొత్తు. దేశంలోనే కాదు, విదేశాలలో సైతం వారి కళకు చక్కటి ఆదరణ, అభిమానాలు లభించాయి. వీరిరువురు సమవయస్కులు కావడమే కాదు, వారి చిత్రాల 'రెట్రోస్పెక్టివ్' ప్రదర్శన అంటే వారి చిత్రకళాయాత్రలో ప్రధాన చిత్రాలన్నింటి ప్రదర్శనలు సైతం విడివిడిగా 2007 జనవరిలో హైదరాబాదు, ఐసిసిఆర్ గ్యాలరీలో జరిగాయి. చిత్రకళాభిమానులకు అవి కనువిందు చేశాయి. వారిద్దరి కళలో విశిష్టతలను అద్దం పట్టే ఆ ప్రదర్శనలు వారి పేర్లు మాత్రమే విన్నవారికి, వారి చిత్రాలను పుస్తకాలు, పత్రికలలో మాత్రమే చూసిన వారికి ఎంతో ఆనందాన్ని, ఆశ్చర్యాన్ని కలిగించాయి. తెలుగువారిలో ఇంతటి గొప్ప చిత్రకారులున్నందుకు గర్వపడేలా చేశాయి.

శేషగిరి రావుకు సంప్రదాయం అంటే ప్రగాఢమైన మక్కువ. భారతీయ చిత్ర కళారీతులను, కుడ్య కళా శైలిని నరనరానా జీర్ణించుకున్న వ్యక్తి ఆయన. రవి వర్మ మాదిరి పాశ్చాత్య శైలిని అనుకరించకుండా, ఎన్నెన్నో పౌరాణిక చిత్రాలను ఆయన భారతీయత ఉట్టిపడేలా రూపొందించారు. రామాయణ, భారత, భాగవత పురాణాలలోని కథాంశాలు ఇతివృత్తంగా ప్రధానంగా కాకతీయ శిల్పకళాకృతులను అనుసరిస్తూ ఆయన గీసిన తైలవర్ణ చిత్రాలు అత్యంత మనోహరంగా ఉంటాయి. శకుతల దుష్యంతులు, కణ్వుని ఆశ్రమం, శకుంతలను కణ్వుడు అత్తవారింటికి పంపే సన్నివేశం, రామాయణంలో అహల్యా శాపవిమోచనం, సీతారామలక్ష్మణులను గుహుడు నదిని దాటించడం, లంకలో రాక్షసస్త్రీల మధ్య సీత- ఇలా ఎన్నెన్నో చిత్రాలను శేషగిరిరావు కన్నులకు కట్టారు. వీటిలో బలమైన భావాలను, మానవ సంబంధాలను అద్భుతమైన రీతిలో చెప్పకలిగారు. ఝాన్సీ లక్ష్మీబాయి, కాళికాదేవి లాంటి వీర, రౌద్ర రసాలు ఉట్టిపడే చిత్రాలకూ ఆయన ఎంతో ప్రతిభావంతంగా రూపకల్పన చేశారు. ప్రత్యేకించి బమ్మెర పోతన, తెలుగు తల్లి చిత్రాలు ఆయనకు మంచి పేరుతెచ్చిపెట్టాయి. వాటర్ కలర్ చిత్రాలలోను శేషగిరి రావు అందె వేసిన చేయి. ఆయన 'ఆక్వా టెక్చర్' అనే ప్రత్యేక విధానాన్ని కూడ స్వంతంగా రూపొందించారు. పక్షులు, జంతువులు, ప్రకృతి దృశ్యాలు, రాళ్లు రప్పలు లాంటి అనేక చిత్రాలను ఎంతో నైపుణ్యంతో వాటర్ కలర్స్‌తో ఆయన తీర్చిదిద్దారు.

ఆంధ్ర దేశంలో కుడ్య చిత్రాలు రూపకల్పనచేసే అతి కొద్దిమందిలో శేషగిరి రావు ఒకరు. హైదరాబాదు నగరంలో ఆయన సారధ్యంలో రూపుదిద్దుకున్న అనేక కుడ్య చిత్రాలు దీనికి శాశ్వత తార్కాణాలుగా నిలుస్తాయి. భారతీయ విద్యాభవన్‌కు ఇరువైపులా 35 అడుగుల ఎత్తు, 10 అడుగుల వెడల్పుతో ఉండే ఈ భారీ కుడ్య చిత్రాలు చరిత్ర, సంప్రదాయం, పురాణాల పట్లనే కాకుండా, వర్తమాన అంశాలపై సైతం ఆయనకున్న లోతైన అవగాహనకు ప్రతీకలు. ఎన్నెన్నో అంశాలను ఆ చిత్రాలలో పొదిగిన తీరు ఈ విధానంలో ఆయన పట్టుకు అద్దం పడుతుంది. వృద్ధాప్యంలో సైతం అంత ఎత్తులో పరంజాలపై నిలబడి ఆ చిత్రాలను రూపొందించారంటే ఎంతో ఆశ్చర్యం కలుగుతుంది. అలాగే మైత్రీవనం భవనం పై కూడ ఇలాగే అద్భుతమైన కుడ్యచిత్రాలను ఆయన నిర్మించారు. తాను సంప్రదాయ శైలిలోనే చిత్రాలను

రూపొందించినప్పటికీ, కాకిపడెగెలు అనే జానపద చిత్రకళారీతిపై ఎంతో వ్యయప్రయాసలకోర్చి ఆయన సర్వేను నిర్వహించడమే కాకుండా, ఆ చిత్ర కళ గురించి అనేక విషయాలను బహిర్గతం చేశారు. ఇలాంటి ఉత్తమ చిత్రకారుని లోటు నిజంగా తీర్చలేనిది.

కాపు రాజయ్య విషయానికొస్తే, మనం ప్రత్యేకంగా చెప్పనవసరం లేకుండా స్వయంగా శేషగిరిరావు ఒక వ్యాసంలో ఆయన చిత్రకళ గురించి ఎంతో హృద్యంగా వివరించారు. 'రాజయ్య చిత్రాలలో రాణివాసాలు కనిపించవు. దుక్కి, బక్కలు, గొల్లలు, కాపులు, కమ్మరి, కుమ్మరులు, బతుకమ్మ పండుగలు, బోనాలు, బోయీలు, పీర్లపండుగలు, జాతర్లు, రంగురాట్నాలు, బెస్తలు, తాళ్లు, ఈతలు, కోతులు, కోడిపందాలు, నూతులు, కుంటలు, చెర్వులు, కాల్వలు, చిన్న చిన్న గుళ్లు, చిల్లర దేవుళ్లు, గోపురాలు, పూరిగుడిసెలు, గుడిసెలపై గుమ్మళ్లు, పెంకుటిళ్లు, బోళ్లు, కోళ్లు– ఇవన్నీ రాజయ్య చిత్రాలలో గూళ్లు కట్టుకుని ఉంటాయి. ఇంకా పగటి వేషగాళ్లు, భాగవతులు, వీధినాటకాలు, గారడి వాండ్లు, దొమ్మెర్లు, పురాణ కాలక్షేపాలు, బోడక్కలు, బాపనయ్యలు, శ్రీవైష్ణవులు, దాసర్లు, రామాయణ, మహాభారత గాథలు, వెయ్యేల ఆయన తెలంగాణా గ్రామసీమలలోని సభ్యతను వర్ణించి అవపోశన పట్టినాడు.' ఇంకా ఆయన ఇలా పేర్కొన్నారు, 'రాజయ్య చిత్రాలు భారత దేశంలోను, ఇతర దేశాలలోని ముఖ్యనగరాల్లో ప్రదర్శింపబడి అనేక బహుమతులందుకున్నవంటే ఆయన చిత్రాలలోని ప్రత్యేక శైలియే కారణం అని చెప్పవచ్చు. రంగులలోని రమ్యత, జాజ్వల్యముచే చిత్రాలకు కాంతి చేకూర్చినాడు. రేఖలు అత్యంత సునిశితం కాకుండా సంపూర్ణత్వం చేకూరుస్తాయి. ఆకృతులలో స్థూలత్వం, అలంకరణ విరివిగా చేయుటలో దిట్టదనం గోచరిస్తుంది. ఏ విషయాన్నయినా తీసికొని తన ప్రత్యేక జానపద శైలిలో మలచగల సాహసం చేయగలడు. చిత్రించకలడు.' ఇది సరిపోతుంది రాజయ్య చిత్రకళ ప్రత్యేకతలు, విశిష్టతలు తెలుకోవడానికి.







కొండపల్లి చిత్ర కళా కౌశలం

మనం ముందుగా చెప్పుకున్న రెట్రోస్పెక్టివ్ ప్రదర్శనలో అడుగుపెట్టిన వారికి తాము ఓ తెలంగాణా గ్రామంలో ప్రవేశించామా అన్న అనుభూతిని కల్గించడమే దీనికి ప్రత్యక్ష నిదర్శనం. దేవాలయాల్లో కనిపించే నకాశి పట చిత్ర శైలికి ముగ్ధుడైన రాజయ్య, దాన్ని తన చిత్రాలకు అనుగుణంగా మలుచుకొని ప్రత్యేకమైన శైలిని రూపొందించుకున్నారు. బెంగాలులో జైమినిరాయ్ అక్కడి కాళీఘట్ పట్ చిత్రాల శైలిని అనుసరించి అద్భుతమైన చిత్రాలను గీసి విశేష ఖ్యాతి నార్జించారు. ఇక్కడ రాజయ్య మన రాష్ట్రంలోని జానపద శైలిని చేపట్టి అద్భుతమైన పేరు సంపాదించారు. శేషగిరి రావు మాదిరిగానే రాజయ్య కూడ అనేక పురస్కారాలను కళాసంస్థలనుండి, ప్రభుత్వం నుండి పొందారు.



కాపురాజయ్య చిత్ర కళా విన్యాసం





ఈ ఇద్దరు అరుదైన, అద్భుతమైన చిత్రకారులకు ఇదే మా నివాళి. ♦

# కళేబరం సజీవమై



స్వీకరించు నన్ను కలకత్తా
నేను నీ తొలి ప్రేమను నీ బాల్యపు నెచ్చెలిని
తప్పిపోయిన నీ తల్లిని,
చూడు నీకోసం సముద్రాన్ని తెచ్చాను
రిక్తహస్తాలతో వచ్చాననుకోకు
నాపాలిండ్లు బరువుగా వ్యర్థక్షీరంతో పొర్లుతున్నాయి
అగాధమైన ఈ ఉప్పునీటిని చూడరాదా?
రా! వచ్చి పరిశీలనగా చూడు
అస్తమిస్తున్న సూర్యుడు నా కనుబొమ్మలపై మెరిసిపోతూ ఉంటాడు

స్పర్శించు కలకత్తా నన్ను స్పర్శించు
వెన్నలాంటి మెత్తని నా మాంసాన్ని
నిరీక్షిస్తున్న నీ బాహువుల్లోకి స్వీకరించు
ఇక నాకు ఒంటరి తనమన్నదే ఉండదు
నీ ప్రార్థనలు వినబడ్డాయి
అందుకే నీకు ఇష్టమైన విధంగా
మృత్యువును తన్ని తిరిగొచ్చాను!
ఎందుకీ కఠోర నిశ్శబ్దం కళ్ళు కదపక ?
నాతో మాట్లాడు తలెఎత్తు.

నువ్వు అనుకున్నట్లుగానే
ఈమె చావు నుంచి తిరిగొచ్చింది !
ఈమె ఎవరో కాదు, చూడు నేనే !
ఈమెను నేనే !
నీ ఊహా ప్రపంచాన్ని
కలలకు అతీతంగా మండుతున్న
నీలోని జ్వాలను !

**- నవనీతా దేవ్‌సేన్**

*ప్రముఖ బెంగాలీ కవయిత్రి సునితా దేవ్‌సేన్ జాదవ్‌పూర్ విశ్వ విద్యాలయంలో ప్రొఫెసర్‌గా పనిచేశారు. ఈ కవయిత్రిలో మాతృ సంబంధమైన సున్నితత్వం ఎక్కువ. పేరుకు తగ్గట్టు ఆమె కవితా నవనీతమే ! కలకత్తా నగరం పుట్టి మూడు వందల సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా పెద్ద ఎత్తున వేడుకలు జరిగాయి. ఆ సందర్భంగా నవనీతా దేవ్‌సేన్ రాసిన కవిత ఇది. ఈమె నోబెల్ గ్రహీత అమర్త్యసేన్ భార్య.*

**- డాక్టర్ దేవరాజు మహారాజు, 9908633949**

# గజల్



**బి. ఇందిర**
**7396303552**

ఉదయాలను తిలకించే హృదయాలకు వందనం
హృదయాలను వెలిగించే ఉదయాలకు వందనం

స్పందించే మనసొకటే మనడానికి చాలునా
ఉదయాలను తలపించే కథనాలకు వందనం

చరితలోన గుర్తులన్ని చెరిపివేస్తె చెరిగేన
కథనాలను ఎదనిలిపే నయనాలకు వందనం

అడుగు - అడుగు కలిసినపుడె దండుకదిలి సాగులే
నయనాలను నడిపించే పయనాలకు వందనం

నలుగురికై యోచిస్తే ముహూర్తాలు ఎందుకులె
పయనాలను ఉరికించే సమయాలకు వందనం

గళములన్ని ఒకటైతే అనురాగం ఇందిరా
సమయాలకు లయమయ్యే చరణాలకు వందనం

# హైకూలు

**బండి ప్రసాదరావు**



అద్దంపై శబ్దం
కాట్లాటలో పిచ్చుక
లేదే... అదృశ్యం

అంబరాన
ఫారిన్ హోరాలు
పక్షి వలస

అన్నీ కిందికి
ఇవి ఊర్ధ్వ ముఖం
కంకి ధాన్యాలు

పాడి ఆవులు
పెరటి పాకలోన
కుక్క సోఫాలో

నింగి తళ్కులు
పగలును చూసాయి
కళ్ళు మూసాయి

వెళ్తుంది అది
లోపలికెళ్ళి చూస్తే
పాలన్నీ ఖాళీ

తలపై బిందె
వెంటాడే పాదముద్ర
వీధి వెంబడి

కులుకుతుంటే
కుట్టెల్తున్నాయి వచ్చి
సీతాకోకలు

విపక్షం లేదు
ఈమె ఉత్తమురాలు
గుణవతామె

కాల ప్రవాహం
కొట్టుకొచ్చిన దేహం
ఈ వృద్ధాప్యము

బుడతడిది
బాక్సింగ్ ఉత్సాహము
ఊయల లోనే !

కోమాలోకెళ్తే
నేతలు నాయకులు
అంతా ప్రశాంతం

# భారతదేశంలో ముద్రణ ప్రారంభ పరిణామ వికాసాలు: తెలుగు భాష

- నూతంకి గౌరి



**తాటాకుల మీద గంటంతో రాయడం పంథొమ్మిదవ శతాబ్దం తొలి దశకంలో తెలుగునాట కొన్ని పల్లెటూళ్ళలో కనిపించేది. బ్రౌన్ దొర కాలానికి తెలుగులో తాళపత్ర గ్రంథాలు అధికంగా కనిపించేవి. వాటిలో అత్యధిక శాతం లేఖకులు చూసి రాసినవే. తెలుగు భాషలో 19వ శతాబ్దం నుండి పుస్తకాలను అచ్చువేయడం, ప్రచురించడం జరుగుతోంది. అక్షరాలను ముద్రగా చెక్కి వాటికి సిరా కానీ నల్ల రంగు కానీ పూసి దానిని ఏదైనా పత్రంపై అద్దడం మన దేశంలో చాలాకాలంగా వుంది.**

**జం**తువులతో సమానంగా అడవులలో జీవించే ఆదిమానవుడు అనేక రకాలైన శబ్దాలకు, అరుపులకు అర్థాలను కల్పించుకొని మాటల ద్వారా తన మనోభావాలను ఇతరులకు చేరవేసేవారు. క్రమంగా మాటలు వాక్యాలై, భాష ఏర్పడింది. భాషకు లిపిని కనుగొన్నారు. లిపిని కనుగొన్న తరువాత మానవజాతి అభివృద్ధి శరవేగంగా జరిగింది. మానవులు తాము పరిశీలించిన ప్రకృతికి సంబంధించిన అనేక రకాలైన అనుకూల, ప్రతికూల చర్యలన్నింటినీ తమ తర్వాతి తరాల వారికి ఆనాటి నుండి నేటి వరకు నిర్విరామంగా అందిస్తూనే వున్నారు. ఈ పరిణామ క్రమంలోనే కాగితం, అచ్చు యంత్రాలు, పుస్తకాలు, పత్రికలు, రేడియో, టెలిగ్రాఫ్, టెలిఫోన్, టెలివిజన్, కంప్యూటర్లు మొదలైనవి మానవుడు కనిపెట్టి తాను సముపార్జించిన వైజ్ఞానిక విషయాలన్నింటినీ త్వరితగతిన ఇతరులకు చేరవేయగలుతున్నాడు.

**భారతదేశంలో ముద్రణ ప్రారంభ పరిణామాలు :** కాగితం ఉపయోగం లోనికి రాకపూర్వం మృగాల చర్మాలు, రాతి పలకలు, లోహ రేకుల మీద రాసేవారు. మనదేశంలో ఉత్తరాదిలో భూర్జ పత్రాల మీద, దక్షిణాదిలో తాటాకుల మీద రాసేవారు. మన పూర్వీకులు కొందరు కడితాలపై రాసేవారు. కడితమంటే జిగురు పదార్థంలో మసిని కలిపి అందులో ముంచి ఆరబెట్టిన వస్త్రం. దీనిపై సుద్ద బలపంతో రాసేవారు. ప్రచురణ సౌకర్యం అభివృద్ధి చెందకముందు భారతీయులు వేల సంవత్సరాలుగా తమ విజ్ఞాన సంపదను కాపాడుకుంటూనే వచ్చారు. వేదకాలంలో గురువు నుంచి శిష్యునికి, ఒక తరం నుంచి మరొక తరానికి జ్ఞానాన్ని అందివ్వడానికి కొన్ని వందల గంటల సమయం పట్టేది. అందువలననే వేద వేదాంగాలను అధ్యయనం చేయడానికి పాతిక సంవత్సరాల కాలవ్యవధి పట్టేదని పెద్దలు చెబుతున్నారు.

గడచిన సుమారు వేయి సంవత్సరాలలో రెండు వందల సంవత్సరాల క్రితం వరకు విలువైన గ్రంథాలను లేఖకుల సహాయంతో ప్రతులు రాయించి, భద్రపరచుకొనేవారు.

తాటాకుల మీద గంటంతో రాయడం పందొమ్మిదవ శతాబ్దం తొలి దశకంలో తెలుగునాట కొన్ని పల్లెటూళ్ళలో కనిపించేది. బ్రౌన్ దొర కాలానికి తెలుగులో తాళపత్ర గ్రంథాలు అధికంగా కనిపించేవి. వాటిలో అత్యధిక శాతం లేఖకులు చూసి రాసినవే. తెలుగు భాషలో 19వ శతాబ్దం నుండి పుస్తకాలను అచ్చువేయడం, ప్రచురించడం జరుగుతోంది. అక్షరాలను ముద్రగా చెక్కి వాటికి సిరా కానీ నల్ల రంగు కానీ పూసి దానిని ఏదైనా పత్రంపై అద్దడం మన దేశంలో చాలాకాలంగా వుంది.

ముద్రణ శబ్దం ముద్ర వేయడం నుంచే వచ్చింది. ప్రాచీనమైన మన కలంకారీ కళ (అద్దకం) కూడా ముద్రణే కాని పుస్తక ముద్రణకు మన పూర్వీకులు ఈ కళను ఉపయోగించలేదు.

క్రీ.శ. 105లో ట్సాయ్‌లన్ అనే చైనా దేశస్థుడు మల్బరీ కాడల సహాయంతో కాగితం తయారు చేశాడు. 7వ శతాబ్దంలో కాగితం తయారు చేసే పద్ధతిని చైనా బౌద్ధ భిక్షువుల ద్వారా జపాన్ ప్రజలు, క్రీ.శ. 793లో బాగ్దాద్ ప్రజలు, క్రీ.శ. 701లో 'సమర్ఖండ్' యుద్ధంలో ఓడిపోయిన చైనా ఖైదీల ద్వారా అరబ్బులు ఈ విద్యను నేర్చుకొన్నారు. అరబ్బుల ద్వారా ఈ కళ ఐరోపా దేశాలకు వ్యాపించింది. కాగితాన్ని

తయారు చేసిన చైనీయులే ముద్రణా విధానం కూడా కనుగొన్నారు. క్రీ.శ. 868లో చైనా దేశంలో 'వజ్ర సూత్ర' అనే బౌద్ధ వాఙ్మయ గ్రంథాన్ని ముద్రించారు. ఇది ప్రపంచం మొత్తంలో ముద్రితమైన పుస్తకాలలో మొదటిది. ఈ గ్రంథం ప్రస్తుతం బ్రిటిష్ మ్యూజియంలో వుంది.

జర్మనీ దేశంలోని మెయింజ్ పట్టణానికి చెందిన జాన్‌గూటన్‌బర్గ్ (1400 - 1468) హాలెండ్‌లోని హార్లెమ్ నగరంలో క్యాస్టర్ అనే డచ్ వ్యక్తి దగ్గర ముద్రణకు సంబంధించిన అనేక విషయాలు నేర్చుకొన్నాడు. గూటన్‌బర్గ్ అసలు పేరు 'జోహాన్‌జెన్స్‌ఫ్లీక్'. ఇతని గురువైన క్యాస్టర్ మరణానంతరం 'ములుకులు, మ్యాట్రిక్సు' తీసుకొని జర్మనీ వెళ్ళాడు. జర్మనీలోని మెయింజ్ నగరంలో జోహాన్‌ఫాస్టు అనే ధనిక స్వర్ణకారుడితో కలిసి ముద్రాశాల ప్రారంభించాడు. ఇక్కడ కదిలే ములుకుల సహాయంతో లాటిన్ భాషలోని 'మజారైన్ బైబిల్' అనే గ్రంథం ముద్రించారు. ఈ ముద్రణ 1450లో ప్రారంభించబడి 1455 వరకు కొనసాగింది.

క్రీ.శ. 1462లో మెయింజ్ నగరం శత్రువుల అగ్నికి కాలి పోయింది. అక్కడ ముద్రాశాలలో పనిచేస్తున్న పనివారందరూ ఇతర దేశాలకు వలస వెళ్ళగా ఈ కళ క్రీ.శ. 1465లో ఇటలీ, 1469లో పరాసు, 1470లో ఇంగ్లాండ్, 1483లో స్పెయిన్ దేశాలలో వ్యాపించింది.



**భారతదేశంలో ముద్రణ పరిణామ వికాసం :** వ్యాపారం, క్రైస్తవ మత ప్రచారం మొదలైన వాటి కోసం మనదేశంలోకి వచ్చిన పాశ్చాత్యులు మన దేశ ప్రజలలో మత వ్యాప్తి చేయాలంటే దేశ భాషల్లో మత గ్రంథాలు రచించి ముద్రించవలసిన అవసరం ఏర్పడింది. ఈ ఉద్దేశంతోనే వారు స్థానిక భాషలను అభ్యసిస్తూ, ఆయా భాషలకు వ్యాకరణ నిఘంటువులను రచించి ముద్రించడం జరిగింది. వీరిలో పేర్కొనదగిన వారు జెసూయిట్, డేనిష్, సిరాంపూర్ మిషనరీలు.

**జెసూయిట్ మిషనరీలు :** క్రీ.శ. 1556లో జెసూయిట్ మిషనరీలు గోవాలో ముద్రాశాల స్థాపించి, 'డొ‌ట్రినా క్రిష్టా' అనే గ్రంథాన్ని ముద్రించారు. ఇదే భారతదేశంలో ముద్రించిన మొదటి పుస్తకం. వీరు 1579లో కొచ్చిన్‌లో ఒక ముద్రాశాలను, 1581లో వైపికోటలో ఒక ముద్రాశాలను స్థాపించారు. క్రీ.శ. 1602లో పోప్ ఒక ముద్రణా యంత్రాన్ని భారతదేశం పశ్చిమతీరంలోని వైపికోటకు జెసూయిట్ మిషనరీల కోసం పంపారు. ఇక్కడ తమిళ, మలయాళ, కొంకణీ భాషలో ప్రార్థనా పుస్తకాలు రోమన్ లిపిలో ముద్రించారు. పోర్చుగీసు భాషలో ముద్రితమైన క్రైస్తవ పురాణాలను మలయాళ భాషలోకి అనువదించి మూడు ముద్రణలుగా ముద్రించారు.

క్రీ.శ. 1674లో బొంబాయి నగరంలో 'భీమ్‌జీ ఫరేక్' అనే గుజరాతీ వర్తకుడు భారతీయ భాషల్లో ముఖ్యంగా గుజరాతి భాషలో టైపులు తయారు చేయాలనే అభిలాషతో ముద్రాశాల స్థాపించాడు. ఇతనికి సహాయంగా తూర్పు ఇండియా కుంఫిణీవారు ముద్రణ విషయాలు తెలిసిన 'హెన్రీ హిల్స్' అనే వ్యక్తిని పంపారు. ఏ ఉద్దేశంతో అయితే భీమ్‌జీ ముద్రాశాల ప్రారంభించారో ఆ ఉద్దేశం నెరవేరకపోవడంతో ఆంగ్లంలోనే ముద్రణ సాగించారు. 1679లో తిరుచూరికి ఇరవై మైళ్ళ దూరంలో ఉండే అంబల్‌కాడ్ అనే గ్రామంలో ఒక ముద్రణాశాల స్థాపించబడి, మొదటి తమిళ - పోర్చుగీసు నిఘంటువు అచ్చయింది. ఇదే భారతదేశంలో ముద్రితమైన నిఘంటువులలో మొదటిది.

**డేనిష్ మిషనరీలు :** క్రీ.శ. 1712లో తంజావూరు జిల్లాలోని ట్రాంక్ బార్ (తరగంబాడి) అనే చోట డేనిష్ మిషనరీలు ముద్రాశాల స్థాపించారు. క్రీ.శ. 1744లో తమిళ భాషలో 'కొత్త నిబంధన' ముద్రించారు. క్రీ.శ. 1713లో మొట్టమొదటి తమిళ వ్యాకరణాన్ని ముద్రించారు. క్రీ.శ. 1779 తమిళ విద్వాంసుడైన 'ఫాబ్రిసియస్' అనే ఆంగ్లేయుడి ఆధ్వర్యంలో తమిళ - ఇంగ్లీషు నిఘంటువు ముద్రించారు. 1778లో ఛార్లెస్ విల్కిన్స్ అనే వ్యక్తి హాల్ హెడ్ రచించిన బెంగాలీ వ్యాకరణం ముద్రించారు. ఉత్తర భారతదేశంలో ఈ విధంగా ముద్రణ ప్రారంభమయింది.

**సిరాంపూర్ మిషనరీలు :** క్రీ.శ. 1793లో విలియం కేరీ అనే లండన్ మిషనరీ సొసైటీకి చెందిన వ్యక్తి భారతదేశం వచ్చి 'ఉద్నే' అనే వ్యక్తి సహాయంతో ఒక ముద్రాశాల స్థాపించారు. 1799లో ఇతనికి సహాయంగా లండన్ మిషన్ సొసైటీవారు విలియం వార్డు, మార్ష్‌మన్ అనే వారిని పంపగా, క్రీ.శ. 1799 ప్రాంతంలో సిరాంపూర్ గవర్నర్ ఈ మిషనరీలను ప్రోత్సహించగా వీరు 1800 జనవరి 10వ తేదీన సిరాంపూర్ చేరి, 1801-1832 మధ్యకాలంలో 2,12,000 పుస్తకాలను మొత్తం నలభై భాషలలోకి ముద్రించారు.

సిరాంపూర్‌లో భారతీయుడైన పంచానన్ అనే కంసాలి ఉండేవాడు ఇతని వద్ద సహాయకుడైన మనోహర్ అనే వ్యక్తి తెలుగు అక్షరాలను తయారు చేయడంలో గణనీయమైన పాత్ర పోషించాడు. 1804లో సిరాంపూర్‌లో బైబిల్‌ను తెలుగులోకి, మరో ఆరు ప్రధాన భారతీయ భాషల్లోకి అనువదించడానికి ప్రణాళిక సిద్ధం చేశారు. 1806లో సంస్కృతంలోకి అనువదించిన 'కొత్త నిబంధన', 'సంస్కృత వ్యాకరణం', 'రామాయణానువాదం' మొదలైనవి ముద్రించారు. 1812 మార్చి 11వ తేదీన సిరాంపూర్ ముద్రాక్షరశాల అగ్నికి ఆహుతి కాగా, వార్డు దొర ఎంతో శ్రమించి తిరిగి ముద్రాక్షరాలు పోతపోసి 1816 నాటికి పూర్తిగా కానీ కొన్ని విభాగాలు కానీ పాత కొత్త నిబంధనలను నలభై నాలుగు భాషల్లోకి అనువదించి ముద్రించారు. కేరీ రచించిన కొత్త నిబంధన, తెలుగు వ్యాకరణం, 'పెన్‌టాటెయ్స్' అనే తెలుగు పుస్తకాలు సిరాంపూర్‌లో ముద్రించబడ్డాయి. ఆవిరితో నడిచే ముద్రణ యంత్రం నెలకొల్పిన కీర్తి కూడా ఈ మిషనరీలకే దక్కింది.

ఈ విధంగా భారతదేశం దక్షిణ, ఉత్తర ప్రాంతాల్లో ముద్రణ కళ ప్రారంభమై పంథొమ్మిదో శతాబ్దం పూర్వార్థంలో పరాకాష్ట దశకు చేరుకొంది.

**తెలుగు ముద్రణా వికాసం :** తెలుగు మాట్లాడే ప్రాంతాలలో తెలుగు పుస్తకాల, పత్రికల ముద్రణ ఎక్కడెక్కడ ఎప్పుడు మొదలయిందీ తేల్చి చెప్పడం సాధ్యం కాదు. తెలుగులో అక్షరాలు కూర్చి ముద్రించే విధానం ఎప్పుడు ప్రారంభమయిందో ఆ కాలంలో ఎవరూ రాయలేదనే చెప్పాలి. అయితే పంథొమ్మిదవ శతాబ్దంలో మొదట ఇందుకు సంబంధించి ఎంతో కొంత సమాచార సేకరణ చేసినవారు సి.పి. బ్రౌన్. తొలి తెలుగు – ఇంగ్లీషు నిఘంటువుకు బ్రౌన్ ఇంగ్లీషులో రాసిన 'ప్రీఫేస్' (ముందు మాట)లో వాక్యాలే ఇందుకు ఆధారమైనాయి. మల్లంపల్లి సోమశేఖరశర్మ మొదలు జోలెపాళెం మంగమ్మ వరకు మరికొంతమంది లోతైన పరిశోధనలు చేసి తెలుగులో ముద్రణకు సంబంధించిన అత్యంత విలువైన సమాచారాన్ని సేకరించారు.

మొట్టమొదట తెలుగులో ముద్రణ తెలుగునాట ప్రారంభం కాలేదు. తెలుగు లిపిలో రాసిన సంస్కృత రచనలు గాని, తెలుగులోనే రాసిన పుస్తకాల ముద్రణ కాని ఇక్కడ జరగలేదు. మొదట జర్మనీలో, తరువాత కలకత్తా సమీపంలోని సిరాంపూర్ (శ్రీరామ్‌పూర్)లో తెలుగులో అచ్చు వేయడం మొదలయింది. తెలుగు అక్షరాలను పోతపోసి తయారుచేసే పద్ధతి కూడా సిరాంపూర్‌లోనే మొదలయింది.



తెలుగు భాషలో, తెలుగు లిపిలో గ్రంథ రచన చేసిన మొదటి ఐరోపియుడిగా కీర్తి గడించిన వ్యక్తి బెంజిమన్ ఘూల్జి. ఈయన 1728లో మద్రాసుకు వచ్చి, తెలుగు, తమిళ, హిందీ భాషలను అధ్యయనం చేసిన వ్యక్తి. 1742లో జర్మనీకి వెళ్ళిన ఘూల్జీ అప్పటికింకా తెలుగులో ఎటువంటి ముద్రణ ప్రారంభం కాలేదని గమనించి కొన్ని క్రైస్తవ మత పుస్తకాలను, బైబిల్‌లోని కొన్ని భాగాలను, కొత్త నిబంధన, క్రైస్తవ ప్రార్థనా పుస్తకాలను లాటిన్ భాష నుంచి తెలుగులోకి అనువదించారు.

1742లో భారతదేశంలో తెలుగు ముద్రణ సౌకర్యాలు లేకపోవడం వల్ల జర్మనీలోని హాలీ పట్టణంలో తెలుగు పుస్తకాలు ముద్రించారు. ఇక్కడ ముద్రితమైన పుస్తకాలు :

(1) మోక్షానికి కొంచ్చు పోయే దోవ.

(2) సత్యమైన వేదంలో వుండే జ్ఞాన ఉపదేశాల యొక్క సంక్షేపం.

(3) బుద్ధి కలిగిన... నూరు జ్ఞాన వచనాల యొక్క చిన్న పుస్తకం

(4) ఒక గురువు, అయిదు బ్రాహ్మల యొక్క నడమన... పెద్ద స్వామి మీద ప్రసంగించిన తర్కమిదే.

ఘూల్జీ తర్వాత తెలుగు ముద్రణ విషయంగా గణనీయమైన కృషి చేసినవారు సిరాంపూర్ మిషనరీలు. డే గ్రేంజ్ అనే మతాచార్యుడు, జార్జ్ క్రాన్, ఆనందరాయర్ మొదలైన వారి సహాయంతో మత్తయి, లూయి, మార్కు సువార్తలు తెలుగులోకి అనువదించారు. విలియం కేరీ రచించిన తెలుగు వ్యాకరణం 1814లో సిరాంపూర్‌లో ముద్రితమయ్యింది. 1818లో "ఈశ్వరుని అన్ని మాటలు... ఇదె ధర్మన్ పుస్తకము" అనే కేరీ రచించిన 960 పుటల కొత్త నిబంధన సిరాంపూర్‌లో ముద్రితమయ్యింది. "ధమన్ పుస్తక! ఈశ్వరుడుయె సమస్త వాక్యములను ప్రకాశము చేస్తున్నాడో! ఆ ఆ వాక్యములు : మోశప్రాని వ్యవస్థా మొ॥" అనే పుస్తకం సిరాంపూర్‌లో ముద్రితమైన చివరి తెలుగు పుస్తకం.

బ్రిటిష్ ఫారిన్ బైబిల్ సొసైటీ వారు కలకత్తాలోని రాధా బజారులో కొనుగోలుకు లభించే భాషల మత గ్రంథాలలో "తెలింగా గాస్పెల్స్" రు. 4లకు లభిస్తాయని ప్రకటించారు. దీనిని బట్టి కలకత్తాలో తెలుగు ముద్రణకు సంబంధించి నటువంటి కృషి కొంతవరకు జరిగి ఉండవచ్చునని భావిస్తున్నారు.

సిరాంపూర్ తర్వాత తెలుగు ముద్రణ గురించి పేర్కొనదగింది మద్రాసులో జరిగిన తెలుగు ముద్రణ. క్రీ.శ. 1812లో మద్రాసులో పోర్టు సెంట్ జార్జి కాలేజీ స్థాపించారు. 1816కు పూర్వం చెప్పుకోదగిన పుస్తకాలేవీ మద్రాసులో ముద్రితం కాలేదు. 1816లో ఎ.డి. కాంబెల్ రచించిన తెలుగు వ్యాకరణం పోర్టు సెంట్ జార్జి కాలేజీ ముద్రాశాలలో ముద్రితమయింది. 1817లో విలియం బ్రౌన్ రచించిన తెలుగు వ్యాకరణం కూడా మద్రాసులో ప్రచురితమయింది. 1819లో మద్రాసులో మొదటిసారి తెలుగు ముద్రాక్షరాలు పోత పోశారు. 1818లో కాన్‌స్టెంటైన్ శాంపీ అనే వ్యక్తి విలియం బ్రౌన్ రచించిన తెలుగు శబ్దావళిని ముద్రించారు. 'విక్రమార్కుని కథలు' అనే వచన గ్రంథాన్ని పోర్ట్ సెంట్ జార్జ్ కళాశాల ప్రధాన ఆంధ్ర ఉపాధ్యాయుడైన రావిపాటి గురుమూర్తి శాస్త్రి రచించారు. తెలుగు వారితో ముద్రితమైన మొదటి గ్రంథం ఇది. ఎ.డి. కాంబెల్ రచించిన తెలుగు నిఘంటువు కాలేజీ ముద్రాశాలలోనే 1821లో ముద్రితమయింది. 1818లో మద్రాసు రీజనల్ సొసైటీ ప్రారంభమై పది లక్షల పైనే క్రైస్తవ బోధనా పుస్తకాలు ప్రచురించింది. గ్రీకు మూలం నుంచి ప్రిచ్చెట్ అనువదించిన కొత్త నిబంధనను మెడ్రాస్ కమర్షియల్ ప్రెస్‌లో బ్రిటిష్ అండ్ ఫారిన్ బైబిల్ సొసైటీ వారు ముద్రించారు. 1818లో మెడ్రాస్ ట్రాక్ట్ సొసైటీ ప్రారంభమై లక్షల సంఖ్యలో అనేక భాషల్లో క్రైస్తవ బోధనా పుస్తకాలు ముద్రించింది. వీటిలో తెలుగు భాషా పుస్తకాలు కూడా చాలా వున్నాయి. 1820లో మెడ్రాస్ స్కూల్ బుక్ సొసైటీ ప్రారంభమై ఒక దశాబ్ది కాల వ్యవధిలో వాచకాలు, ఛందో గ్రంథాలు, వేమన పద్యాలు, పంచతంత్రం లాంటి వాటిని ప్రచురించింది.

జె.సి. మోరిస్ రాసిన తెలుగు వాచక పుస్తకం 1823లో ప్రచురితమయింది. సి.పి. బ్రౌన్ దొరగారి సంస్కృతాంధ్ర భాషల ఛందో గ్రంథం 1827లో ముద్రితమయింది. జాన్‌గార్డన్ రచించిన కొత్త నిబంధన 1829లో మద్రాసులో చర్చి మిషన్ ముద్రాశాల వారు ముద్రించారు. ఇది 540 పుటల గ్రంథం. సి.పి. బ్రౌన్ ఇంగ్లీషు అనువాదంతో చేర్చి వేమన పద్యాలు 1829లో కాలేజీ ముద్రాశాలలో ముద్రించారు. విలియమ్ బ్రౌన్, కాంబెల్, జె.సి. మోరిస్, సి.పి. బ్రౌన్

## కాలానికో నమస్కారం

గోపగాని రవీందర్
9440979882

క్షణాలయుగాలపై
ఆనవాళ్ళ స్మృతుల గానాన్ని
నిర్మానుష్యావరణలోని ఒంటిరియానాన్ని
తెగువతో పలకరిస్తావు.



ఆకులు రాలినంత సహజంగా
మనస్సు పొరల్లోకి ఇంకుతావు
విధ్వంస విలయ దృశ్యాలను
వినోదంగా ప్రదర్శిస్తే ఆగ్రహిస్తావు

స్వప్న సాకారాల సమరపథంలో
వెంట నిలిచిన నెచ్చలివి
జ్ఞాపకాల ముసురులోని
తండ్లాటకు ఊరడింపైన ఊటశక్తివి.

పోరుమైదానంలో
ఒరిగిన అమరుని సాక్షిగా
అస్త్రాలను సంధించిన దుఃఖాశ్రువు

గమనంలోని గాయాలకు
చందన కాల లేపనానివి
అవిశ్రాంతంగా నేటికి
బాహువులను విప్పుతున్న
కాలానికి నమస్కారం...!

## మసిబట్ట

ఎన్. అరుణ



ఒకప్పుడు దానికీ
రంగు రంగుల కలలుండేవి
జరీ అంచు నుంచి
చింపినప్పుడు అయిన గాయాన్ని
తేలిన పోగులే చెప్తాయి

ఒకప్పుడు
శరీర కావ్యానికి
ముఖపత్రంలా ఉండేది.
అప్పుడు మనస్సు
కావ్యాత్మలా ప్రకాశించేది

ఇవాళ
నీళ్ళలో తడిసిన
మసిబట్టను పిండుతుంటే
చెమటా కన్నీళ్ళూ కలిసి
వర్షిస్తున్నట్టుగా ఉంది

క్రమంగా
జ్ఞాపకాలు వెలిసిపోయి
ఒకే నలుపు వర్ణం
దిగులుకు ప్రతీకలా మిగిలింది

బుసకొట్టే
అన్నం గిన్నెను జోకొట్టి
వేళ్ళకు వేడిని అంటనివ్వని
చల్లని హృదయం దానిది

ఎప్పుడన్నా మా పిల్లలు
మసిబట్టను విసిరికొడితే
చరిత్రను
నిరాకరిస్తున్నట్టుగా ఉంటుంది
నిజానికిది మసిబట్ట కాదు
జ్ఞాపకాల పుట్ట

---

ఈ నలుగురు ఇంగ్లీషు దొరలు తెలుగు ముద్రణ విషయంలో ఎక్కువ శ్రద్ధ చూపారు.

**మద్రాసు తర్వాత బళ్ళారిలో తెలుగు ముద్రణకు సంబంధించిన కృషి జరిగింది.** బళ్ళారి మిషన్ 1812లో, 1815లో బళ్ళారి ట్రాక్ సొసైటీ ప్రారంభమయ్యాయి. ఎ.డి. కాంబెల్ బళ్ళారి జిల్లా అధికారిగా వున్నపుడు 1825లో ఒక ముద్రాశాలను స్థాపించి అనేక క్రైస్తవ బోధనా పుస్తకాలను ముద్రించారు."బళ్ళారి వారు క్రీ.శ. 1825 - 1835 మధ్య చిన్న చిన్న కరపత్రముల వంటి వానిని ప్రకటించిరి. వానిలో 17 మాత్రమే లభ్యమగుచున్నవి" అని "ఆంధ్ర వచన వాఙ్మయము" (ద్వితీయ ముద్రణ పు.53) లో నిడదవోలు గారు రాశారు.

**బళ్ళారి తర్వాత విశాఖపట్టణంలో తెలుగు ముద్రణకు సంబంధించి కృషి జరిగింది.** రెవరండ్ అగస్టస్ డే గ్రేంజ్, జార్జి క్రాన్ - మత్తయి, లూాయిూ, మార్కు సువార్తలను తెలుగులోకి అనువదించారు. జాన్ గార్డన్, ఎడ్వర్డ్ ప్రిచ్చెట్ కొత్త నిబంధనను ఆంధ్రీకరించారు. విశాఖలోని లండన్ మిషన్ సొసైటీ వారు తెలుగులో అనేక క్రైస్తవ బోధనలకు సంబంధించిన పుస్తకాలు ప్రచురించారు. "ఈ మిషన్ వారు క్రీ.శ. 1840లో పని ప్రారంభించి, పదునెనిమిదేండ్లు శ్రమించి 80 చిన్న గ్రంథములు ప్రకటించిరి" అని నిడదవోలు గారు "ఆంధ్ర వచన వాఙ్మయము (రెండో ముద్రణ. పు. 53) లో రాశారు.

తర్వాత మచిలీపట్నం, కాకినాడ మొదలైన ప్రాంతాల్లో కూడా క్రమేణా ముద్రాశాలలు నెలకొని తెలుగు ముద్రణ జరిగింది. క్రైస్తవ మతాచార్యులూ, కుంఫిణీ ఉద్యోగులూ వారు తమ తమ ప్రయోజనాల కోసమే ముద్రణ కళను భారతదేశంలో ప్రవేశపెట్టినప్పటికీ ఇటు తెలుగులోనూ, అటు భారతీయ భాషా సాహిత్యాలన్నింటిలోనూ కనీవినీ ఎరుగని ప్రగతిని సాధించింది. తెలుగు ముద్రణకు సంబంధించి మొదట ఎక్కువగా జర్మనీలోని హోలీ పట్టణంలోనే జరిగింది. మన దేశంలో ముద్రణా సౌకర్యాలు అంతగా అభివృద్ధి చెందకపోవడమే దీనికి ప్రధాన కారణంగా చెప్పవచ్చు.

విదేశీ మేధావులైన అనేకమంది మన భాషా తత్వాలనూ, స్వరూపాలనూ పరిశోధించి, ఆధునిక శాస్త్రీయ పథంలో వాటినన్నింటినీ నడిపించి, కొత్త కొత్త విషయాలను బయటకు తీశారు. వీరివల్ల మన భాషా సాహిత్యాలకు, భాషకు జరిగిన ఒక గొప్ప ఉపకారానికి మనం ఎలా వెల కట్టగలము?

1830 తరువాత తెలుగులో పత్రికలు కూడా వెలువడ్డాయి. తెలుగు ముద్రణా వికాసంలో 1830ని, ఒక మైలురాయిగా పేర్కొనవచ్చు.

రచయిత్రి సెల్: 9010662129

కథ

# గుండె

బి.వి.ఎస్. ప్రసాద్.

సెల్ : 9949944006



ఆ ఆకులు చూడండి
ఎలా రాలిపోతున్నాయో..." రత్న పలకరిస్తోంది
మౌనం దాల్చిన తన భర్త రంగారావుని...
"...."
"మనమూ రాలిపోతాంగా ఒకరోజు.."
"...."
ఇంటి ముందు పోర్టికోలో కుర్చీలు వేసుకొని కూర్చొని ఉన్నారు వాళ్ళిద్దరూ.
సాయంత్రం.. 6.30
'ఏం చేయాలో... ముందు ముందు ఎలాగో..! ఇవే ఆలోచనల్తో రత్న గాబరా పడుతున్న మాట వాస్తవం.
ఈ వాళ ఉదయాన్నే తన టెస్టు రిపోర్టులన్నీ వచ్చాయి. లెఫ్ట్ వెంట్రికల్‌లో మూడు బ్లాకులు ఉన్నాయంటున్నారు. సర్జరీ తప్పనిసరి!

* * *

రంగారావు చేసింది చిన్న గవర్నమెంటు ఉద్యోగం, నిజాయితీగా, రిటైరై ఐదేళ్ళయిందీ రత్నకూడా మునిసిపల్ స్కూల్‌లో ప్రైమరీ టీచర్‌గా పనిచేసి ఏడాది క్రితం రిటైర్ అయ్యింది. రిటైరు కాగానే వచ్చిన మొత్తాల్లో ఓ చిన్న ఇల్లు కొనుక్కొని తెనాలిలో సెటిలయ్యారు. రంగారావుగారి అమ్మాయి రూప. పేరుకు తగిన రూపవతి ఎమ్.బి.ఎ. కట్నాలు కోరకున్నా పెళ్ళి "ఘనంగా" చేయించారు వియ్యంకుడు గారు. దాంతో దాచుకొన్న ఐదారు లక్షలూ రెక్కలొచ్చిపోయాయి.

కొడుకు డిగ్రీ సరిగా చదవకున్నా తన బతుకు తను బతకాలని లేటుగా ఐనా, తనలోటు తెలుసుకొన్నాడు. ఆర్.టి.సీలో డ్రైవర్‌గా చేరి వాడి సంసారం బండివాడుదేకుతున్నాడు. వాడి బాధ్యతలు మోయాల్సిరానందుకు ఆనందించాల్సిన పరిస్థితి.

* * *

ఇక ఉన్నది 20 రోజులు. రత్న ఆపరేషన్‌కి సమకూర్చాల్సింది రెండున్నర లక్షలు. ఆలోచన మీద ఆలోచన. రంగారావు బుర్రవేడెక్కుతోంది.

మనసులోనే వేశాడు లెఖ్ఖలు. ఇలాంటి వాటిలో దిట్టే బుర్రచురుగ్గా పనిచేస్తుంది. సర్వీసు మొత్తం తను చేసింది అదే కదా. ప్రావిడెంటు ఫండులోను లాంగ్ టర్మ్ ఫీజులూ, రికరింగ్ డిపాజిట్లు ముందే మూసేసి కట్టాల్సిన పరీక్ష ఫీజులకూ, ఇంటర్యూలకూ 'సర్దడం. ఈ అనుభవం మెండుగా వుండనే వుంది. చీటీలు కడితే ఎక్కువ వడ్డీవస్తుంది. మేం లాభపడ్డాం. మీరూ చేరండని ఎదురింటి మూర్తి గారి భార్య భానుమతి చెబితే, అవే మాటల్తో రంగారావుని ఒకసారి హోరెత్తించింది రత్న. అపుడేమైంది!! వాళ్ళమ్మకు సుస్తీ చేసి ఆసుపత్రి పాలైతే 'చీటీలకు చెల్లుచీటీ' పాడేసాడు రంగారావు.

* * *

రంగారావుకి ఇపుడు ఉద్యోగం లేదు. ఆధారం పెన్షనే. సర్వీస్‌లో ఉన్నపుడు కోతలు పోను 16 వేలు వస్తే నెట్టుకొచ్చాడు. భార్య జీతం తోడైనందున భార్యకి పెన్షన్ నామమాత్రమే. యిద్దరిదీ కలిపినా 15వేలు దాటదు పెన్షన్. జాగ్రత్తగా ఉంటేనే నెలగడిచేది. అన్నీ ధరలైపోయె !

రిటైరైనపుడు తన బాల్యమిత్రుడు రఘురాం ఫోన్‌చేసి అభినందించాడు. 'నీకేం బాధ్యతలు తీరాయిగా! యిక బతుకు హాయిగా! అంటూ ఎన్నో సలహాలూ నీతి వాక్యాలూ చెప్పాడు. 'పిల్లల పంచన చేరి సెటిలైన వాడికి నీకేం తెలుస్తాయి నా బోటివాడి కష్టాలు పైగా వాడికి ఆడపిల్లల్లేరు' అనుకున్నాడు. తనను తాను సముదాయించు కొంటూ" !

పిల్ల కాన్పుకి వచ్చి వెళ్ళేసరికి మరోలక్షన్నర దాకా హారతైపోయింది. ఇక మిగిలివున్నది మూడున్నర లక్ష. డిపాజిట్టు అదీ తాకట్టు పెట్టక తప్పలేదు రంగారావుకి .రెండేళ్ళ క్రితం తనకు హార్ట్ ఎటాక్ వచ్చినపుడు హాస్పటల్ బిల్లులకీ, ఇతర ప్రయాణం ఖర్చులకీ. అంతకు మునుపు వరకూ, ఆ ఎఫ్‌డి మీద నెల నెలా రెండు వేలపైగా వడ్డీ వచ్చేది. దానిపై అప్పు తీసుకోవడంతో, ఇపుడు ఆ భాగ్యం కూడా లేదు.

ఆరోగ్యాన్ని ఏమాత్రం అశ్రద్ధ చేయకున్నా యిదిగో యిలాంటి ఉపద్రవాలు మీద వచ్చిపడుతూంటే, తను మాత్రం ఏం చెయ్యగలడు గనుక!" జన్మ దుఃఖం జరా దుఃఖం" అననే అన్నారు పెద్దలు.

రత్న తల్లితండ్రులు ఎపుడో పోయారు. రత్న తమ్ముడు రామభద్రంది విజయవాడలో చిన్నపాటి వ్యాపారం. రత్న అంటే వాడికి వల్లమాలిన ప్రేమ. రత్నకు తరచూ చీరలూ, బహుమతులూ తెస్తూండే వాడు. వాడికి అక్కయ్య పిల్లలన్నా ఎంతో అభిమానం. నలభై ఐదేళ్ళకే పోయాడు. హెపాటిటీస్ వచ్చి కనుమరుగయ్యాడు కన్నీళ్ళు మిగిల్చి.



రంగారావు పెద బావగారిది పౌరోహిత్యం. శ్రోత్రియుడు. అతడు "తనేంటో తన పనేంటో" అనే టైపు మనిషి. కానీ విచిత్రం. అలాంటివాడు రత్నకు ఆపరేషన్ అని తెలిసి వచ్చి చూసిపోయాడు. నిన్నపోతూ పోతూ, 'బావా ఈ ఐదువేలూ ఉంచు' అంటూ రంగారావు చేతుల్లో పది ఐదు వందల కాగితాలు పెట్టాడు. 'ఇంత కంటే నాకు శక్తిలేదు' అని చెబుతోంది అతనిచూపు. ఇలా చేయిచాచడం నాకూ తగదు. కానీ తప్పని దీన స్థితి.. తెలిసి తలవొగ్గింది యితడి చేయి.

రంగారావు తన ప్రయత్నంలో భాగంగా బ్యాంకులో పనిచేసే ఆఫీసరు గోపిగారింటికి వెళ్ళాడు వర్షంలో తడుస్తూ...

"బాగా చీకటి పడింది గొడుగు కూడా లేకుండా యిలా వచ్చారేంటి మాస్టారూ"... పలకరించాడు గోపి. గోపీ గత ఐదేళ్ళుగా బాగా తెలిసిన వాడే. తలతుడుచుకోండి అంటూ టవల్ ఇచ్చింది గోపి భార్య. విషయం చెప్పి, "నాకు బ్యాంకు నుండి ఏదైనా లోన్ ఇప్పించగలవా?' అడిగాడు రంగారావు.

'మీ డిపాజిట్ మీద బకాయి వడ్డీ పోనూ పది పదిహేను వేలే వస్తాయి సారూ.. మీకు లోనంటే ఎలా? మీరా రిటైర్ అయితిరి. మీ వయసు 65 దాటింది. కనుక బ్యాంకు ఎలాంటి లోనూ యివ్వలేదు మాస్టారూ.. ఐతే మీకు బంగారం మీద గోల్డ్‌లోన్ ఏదైనా యిప్పించగలను.." దారి వుందంటు పరిష్కారం చూపబోయాడు.

రత్నది జాలిమనసు కూతురు మీద ప్రేమకొద్దీ. దాని కాపురం బాగుండాలనీ ఎంచి రెండు మూడు దండలూ, నాలుగేసి గాజులూ యిచ్చేసింది.

అమ్మాయికే అన్నీ యిస్తావా అని కొడుకు ఎక్కడ తప్పుపడతాడోననే భయానికి కోడలికీ, మనవరాలుకీ చెరో చైనూ యిచ్చేసింది, మంగళ సూత్రాలు కళ్ళకద్దుకొంటూ వుంది.

ఇప్పుడా దండలూ, గాజులూ వుండివుంటే బంగారం రేటు బాగా పెరిగి వుంది గనుక అప్పుగానో లేదా అమ్మేసి సొమ్ముగానో తీసుకొంటే ఈ కష్టం గట్టేక్కేది.

ఇపుడు పిల్లల్ని అవి తాకట్టు పెట్టడానికని అడగాలన్నా మనసు నోచ్చుకొంటోంది!! అవి తమ సొమ్మే నిన్నటి వరకూ!!

"ఇంకేం దారి లేదా? మెల్లగా అడిగాడు రంగారావు. ఆశ చావదు. ఆకాశంలో ఉరుములు, మెరుపులు!! కుండపోతగా వర్షం..

* * *

ఉంది మాస్టారూ.. మీ యిల్లు తనఖా పెట్టి డబ్బు తీసుకోవచ్చు!! 'నేనా ముసలి వాడినైపోయాను.. నాకూ గుండె ఆపరేషన్ జరిగింది. యింకెన్నాళ్ళుంటానో.. అసలు వడ్డీ కట్టడం నా వల్ల అయ్యేనా గోపిగారూ'... నీకు తెలిసినదేగా నా నిస్సహాయత అంటోంది అతడి కర స్పర్శ.. ఇల్లు అమ్మండనే సలహా ఆ వయసులో వారు మెచ్చరని గోపీ పలకలేదు...

* * *

బయట జోరైన వర్షం.. గేటు తీసిన చప్పుడు.. రయ్‌మంటూ టూ వీలర్ ఆపి గోపి బామ్మరిది నాగేంద్ర వచ్చాడు లోనికి, 'ఏం రంగారావు మాస్టారూ.. బాగున్నారా?' అడిగాడు లోని కెళ్ళి టవల్ తెచ్చుకొని తల తుడుచుకొంటూ!!

'ఏం బాగు బాబూ.. నాకు గుండె ఆపరేషన్ అయి రెండేళ్ళు కాలేదు.. ఇపుడు మా ఆవిడకు సర్జరీ అంటున్నారు. ఖర్చు మీద ఖర్చు నేను అటు శ్రీమంతుడనీ కాను.. యిటు ఆరోగ్య శ్రీ కార్డులందుకొని ఫ్రీగా ఆపరేషను చేయించుకోవడానికి తెల్లకార్డుగల పేదవాణ్ణీకాను. నా ఖర్మయిలా రాసి వుంది.. నా పేద గుండె మీద ఆ భగవంతుడికి జాలి గుండె లేకపోయె!"...

నాగేంద్రను రంగారావు గారు బాగా ఎరుగుదురు. నాగేంద్రలాంటి వాళ్ళు చొరవగా తెలిసిన వాళ్ళందరినీ తియ్యగా పలకరించి 'బుట్టలో వేసుకొంటారనే పేరున్న ఎల్ఐసి ఏజెంటు.

"మీరు రిటైర్ కాక ముందు ఐదారేళ్ళ నుండీ చెబుతూనే వున్నా మాస్టారు. ఒక ఆరోగ్యబీమా పాలసీ చేయమని మీరు వింటేనా? ఏటా మూడు వేలు కడితే మీకూ, మీ భార్యకూ రెండు లక్షల ఆరోగ్యబీమా వసతి వుండేది... మీ యిద్దరి సర్జరీలకయ్యే నాలుగు లక్షలూ ఎల్.ఐ.సినే యిచ్చేది కదా.. అప్పట్లో 'మేం ఏటా కట్టే మూడు వేలూ ఏట్లో వేసినట్లేగా' అని వెక్కిరించారు. ఇపుడు ఆపరేషన్లకి నాలుగు లక్షలూ మీ జేబు నుంచి చేజారి పోయినట్లేనా.. ఆ మేరకు మీరు పేదగా మిగిలినట్లేనా..' ఆరోగ్య పాలసీల అవసరాన్ని నేటి పెరిగిన వైద్య వ్యయం దృష్ట్యా వివరించినా తెలుసుకోని ప్రజల అలసత్వం మీద అతని ఆక్రోశం వెలిగక్కాడు.

"ఔననుకో.. మా చిన్న బామ్మరిది రామభద్రం కూడా లేడు.. వాడు వ్యాపారంలో ఉన్నాడు గనుక ఎక్కడి నుండైనా తెచ్చేవాడు.. ఆరిపోయిన ఆశ గురించి ఆలోచించి ఏం ప్రయోజనం'... రంగారావే అన్నాడు మళ్ళీ!

నాగేంద్ర ఊరుకోలేదు.." మీ బెజవాడ చిన బావగారా?

# అక్షరమై మొలుద్దాం

- సౌగంధి యశస్విని

తరగతి
ఆలోచనల
సంఘర్షణా నిలయమయినప్పుడు
బాల్యం
ఓ సున్నిత కుసుమం
మెత్తని ఇనుము
పారే సెలయేరు
నిత్య నూతన పరిశోధన
తళుక్కున మెరిసే మెరుపు
మానసికానందపు మనోవిజ్ఞాన దీపిక
కిండర్‌గార్టెన్‌లో తిరగాడే
ఓ సీతాకోక చిలుక

తరగతి గది
వస్తు కర్మాగారమయినప్పుడు
బాల్యం
భారమైన భవిష్యత్ చిత్రం
స్వేచ్ఛగా గెంతే
లేగమెడలో గుదిబండ
గడ్డకట్టిన మంచుదిబ్బ
ఓ బ్యాంకు ట్రాన్సాక్షన్ కాగితం
అదీ కాకపోతే
ఓ నిపుణుడి చేతిలో తయారయ్యే
మానవ బాంబు

ప్రియమైన
నా
పంతుల్లారా



తరగతి గది
దేశ భవిష్యత్తును ప్రసవిస్తుంది
పురిటి నొప్పుల వేదనానంతరం
మురిసిపోయే తల్లులమవుదాం
ఈ ప్రపంచంలో
ఎవ్వరూ చేయలేనిది
మనం మాత్రమే చేయగలిగేది
పలకల్ని
పట్టుకున్న
చేతుల్ని ప్రేమించడం
ఆ చేతుల్లో
ఒద్దికగా అక్షరమై మొలుద్దాం రండి
'అక్షరం'
వెయ్యి మెదళ్ళకు
పదును...

---

ఆయన చుట్టూ తిరిగి ఓ పాలసీ చేయవయ్యా.. నీది ఉద్యోగం కాదు.. వ్యాపారంలో ఉన్నావు. ఓ పెద్ద పాలసీ తీసుకోమంటే ససేమిరా అన్నాడు.. అక్కడికి నేనేదో లబ్ధిపొందుతున్నట్టు. నాకు చేయలేదని కాదు.. పోనీ యింకెవరి ద్వారా ఐనా చేశాడా? లేదే!! అతని కుటుంబాన్ని ఆదుకొనే అవకాశం అతనే కల్పించలేదు.." మీరింతే అన్నట్లుగా ముఖం పెట్టాడు.

"మీరేం చేశారూ.. ఏటా మూడు వేలంటే నెలకో ఐదువందలు.. పదేళ్ళలో ముప్పైవేలు. వేస్తుపోతాయని తలచారే కానీ, అదే ముప్పైవేలు గుండె ధైర్యం యిచ్చి ఆదుకొనేదని గుర్తించలేకపోయారే సార్!

మన శరీరానికి గుండె ఎంతో ముఖ్యం... అది క్షణం ఆడకుంటే ఈ శరీరం పతనమౌతుంది... బీమా మీ ఆర్థిక పరిస్థితికి గుండెకాయలాంటిది మాస్టారూ!! బీమా చేసివుంటే మీ పరిస్థితి యిలా పడకవేసి వుండేది కాదు సార్! యిలాడీలాపడి వుండే వారుకారు. నా ఆవేదన అర్థం చేసుకోండి.."

నాడు రంగారావుని ఒప్పించలేకపోయినందుకు నొచ్చుకొన్నాడు నాగేంద్ర.



* * *

రంగారావుకి చేసిన తప్పిదం అవగతమౌతూ వుంది. ఆకులు కాలాక... ఏం చేయగలడు.. చేతి కర్ర చుబుకం కింద ఆనించి నిట్టూర్పు విడుస్తున్నాడు, వర్షం వెలిసిందా లేదా గమనిస్తూ!

'మాస్టారూ.. మరో దారి వుంది... అయితే మీరు ఏమీ అనుకోనంటే చెబుతాను".. గోపి మాటలు ఉత్సాహ పరచాయి రంగారావుని.

"కొత్తగా రివర్స్ మార్టిగేజ్ అనే పథకం ప్రవేశ పెట్టాయి బ్యాంకులు. మీ ఇంటి మార్కెట్ వాల్యూ ఆధారంగా మీ ఇంటి మీద లోన్ యిస్తారు. మీరు అసలు కానీ వడ్డీకాని ఏమీ చెల్లించనక్కరలేదు.. మీ తదనంతరం"... స్వరం తగ్గించి చెబుతున్నాడు గోపీ.. "మీ తదనంతరం.. బ్యాంకే ఆ ఇల్లు అమ్మి లోన్, వడ్డీలకు రావలసినది పట్టుకొని మిగిలినది మీ వారసులకు చెల్లిస్తారు. దాని వలన మీ జీవితకాలంలో మీరు కట్టుకొన్న యిల్లు అమ్ముకోవడం, మళ్ళీ అద్దె ఇళ్ళలో కాలం వెళ్ళబుచ్చాల్సిరావడం లాంటి అగత్యం వుండదు.. మీరు సమకూర్చుకొన్న స్థిరాస్తి మీకు ఉపయోగపడుతుంది. సరేనంటే.. రేపు బ్యాంకుకు రండి.. మేనేజర్ గారికి చెప్పి రివర్స్ మార్టిగేజ్‌లోన్ యిప్పిస్తాను.." మీ యింటికి ఓ పదిలక్షల దాకా తీసుకోవచ్చు.." చెప్పడం ఆపుతున్న గోపి రంగారావు కళ్ళలో నీళ్ళు తిరగడం గమనించాడు.

పదిలక్షలుంటే.. ఇకనేం దర్జాగా బతికేయచ్చు. అదీ డబ్బు యిచ్చే ధీమా !

వాన వెలిసింది !

వెళ్ళొస్తానన్న రంగారావుని 'మీ ఇంటి దగ్గర దిగబెడతానన్నాడు నాగేంద్ర.

బైక్ దిగిన రంగారావు, 'ఆ ఆరోగ్య భీమా యిపుడు మాకు యివ్వరు తెలుసు ! మా అబ్బాయి చేత తప్పక చేయిస్తా !' అన్నాడు నాగేంద్రను దీవిస్తూ !

చావు తప్పి కన్నులొట్టబోయినందుకు సంతోషించాడన్న చందాన రత్న ఆపరేషన్‌కి సొమ్ము సమకూరుతున్నందుకు సంతోషంతో వెళ్ళాడు లోనికి. రంగారావు గేటు తీసి వడివడిగా అడుగులేస్తూ!! ♦

# పొట్లపల్లి సాహిత్య సర్వస్వం సందేశం




తెలంగాణాలో తొలి తరం కథకుడు, కవి, స్వాతంత్ర్య ఉద్యమాల భాగస్వామి పొట్లపల్లి రామారావు జీవిత సాహిత్యాలను మథించి భూపాల్ పుస్తక త్రయంగా అందించారు. ఇందులో వ్యక్తిత్వం - సాహిత్యం అన్నది ఆయన పరిశోధనా గ్రంథమైతే తక్కిన వాటిలో కవిత్వం, వచన రచనలు పొందుపర్చారు. వీర తెలంగాణా చైతన్య మాగాణపు సుసంపన్న వారసత్వాన్ని, పొట్లపల్లి రామారావు సమున్నత వ్యక్తిత్వాన్ని, సృజన సామర్థ్యాన్ని, తాత్విక ప్రగాఢతను ప్రతిబింబించే పుస్తక త్రయం ఇది.

పొట్లపల్లి రామారావు పేరు సాహిత్య చరిత్ర చర్చల్లో వినిపిస్తూనే వుంటుంది గాని ఆయన రచనలు ఎక్కువ భాగం అందుబాటులో లేవు. అలాగే తొంభై ఏళ్లకు పైబడిన సంపూర్ణ జీవితం గడిపిన ఆయన వ్యక్తిగత విశేషాలు కూడా పెద్దగా తెలియవు. పట్టాకే పరిమితం కాకుండా పట్టుదలగా అనేక విషయాలు సేకరించి అనేకమందిని సంప్రదించి పుస్తకం విలువ పెంచారు భూపాల్.

1917లో వరంగల్ జిల్లా తాటికాయల గ్రామంలో దొరల ఇంట పుట్టిన పొట్లపల్లి తండ్రి మరణం కారణంగా ఆస్తులన్నీ మొదటే పోగొట్టుకున్నారు. బడి దశలోనే చదువులు మానేసిన రామారావు ఉర్దూ పారశీక ఇంగ్లీషు హిందీ భాషల అధ్యయనంతో పాటు కొంత వరకూ సంస్కృత ప్రవేశం కూడా సంపాదించారు. నాటి నిజాం నిరంకుశ పాలనలో వెట్టిచాకిరీ కింద మగ్గుతున్న పీడిత ప్రజల పరిస్థితులు ఆయనను ఆవేదనకు గురిచేశాయి. స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహంలో పాల్గొని 1939లోనే ఆరు నెలలు జైలు శిక్ష అనుభవించారు. వామపక్ష ప్రజాస్వామిక భావజాలం వంటపట్టించుకున్నారు. నిరాడంబర జీవితం గడుపుతూ స్నేహశీలిగా పేరు తెచ్చుకున్నారు. కాళోజీ వంటి వారికి సమకాలికుడు సన్నిహితుడైన ఆయన మొదటి కథల సంపుటి "జైలు" 1945లో ఆంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారు అచ్చువేశారు. ఇందులోని కథలకు తోడుగా మరో పద్నాలుగు భూపాల్ శ్రమపడి సంపాదించారు. 1945-49 మధ్య రాసిన నాటికలు కూడా వచన విభాగంలో వున్నాయి. ఇవన్నీ నాటి సామాజిక పరిస్థితికి అద్దం పట్టేవిగా వున్నాయి. వెట్టి చాకిరీలో మగ్గిన దీన జనం వేదన, అధికారుల ఆధిపత్యం అవినీతి, అదే సమయంలో కుటుంబ సంబంధాలలో స్వార్థ ప్రలోభాలు, నేరస్త జీవితాల నేపథ్యాలు వగైరాలు సరళ సుందరంగా చిత్రించారు. కొంతమంది గొప్పగా కీర్తించే నైజాం పాలనలో అత్యధిక ప్రజానీకం అనుభవించిన నరకప్రాయమైన పరిస్థితులేమిటో ఈ కథలు కళ్లకు కడతాయి. శిల్ప పరంగా కూడా ఈ కథలు ఎన్నదగినవనే వాస్తవాన్ని ముందుమాట రాసిన ముదిగంటి సుజాత రెడ్డి చక్కగా విశ్లేషించారు.

పొట్లపల్లి కవిత్వం విషయానికి వస్తే వాటిలో భావ సరళతకే ఎక్కువ మెప్పు లభిస్తుంది. కాళోజీ, వట్టి కోట ఆళ్వారు స్వామి వంటి వారి ఒత్తిడితో ఎట్టకేలకు 1957లో 'ఆత్మ వేదన' పేరుతో మొదటి సంపుటంగా రావడానికి సిద్ధపడినా తన కవితల పరిమితిని ఆయన సూటిగానే పేర్కొన్నారు. ఈ సంపుటిలో కష్టజీవుల గురించి అసమానతలు, అన్యాయాల గురించి రాయడం చూస్తాం. రైతు కాదంటే రాజు నిలవడన్న సందేశం వుంటుంది. 'ధన మదాంధుల భోగ / తృష్ణ పోయిన నాడె / ఉరిత్రాడు తెగిపోవురా / చెరసాల పడిపోవురా' అన్న వాక్యాలు నేటికీ వర్తిస్తాయి. తర్వాతి సంపుటి 'చుక్కలు' 1965లోనూ, బాగా విస్తరించిన రూపం 1974 లోనూ ప్రచురితమైంది. కాళోజీ వలె గాక పొట్లపల్లి ప్రధానంగా జీవన తాత్వికతపై కేంద్రీకరించి సాధారణ వాక్యాలుగా పేర్చుకోవడమే ఎక్కువగా జరిగింది. వీటిలో కొన్నిటిని ఏరి మెరుపులు పేరిట యువ భారతి సంస్థ తీసుకొచ్చింది. అందులో కొన్ని చదివి ఉత్తేజితుడైన ఒక సాహత్యాభిమాని పొట్లపల్లికి లేఖ రాస్తూ విరాళం పంపితే ఆ ప్రేరణతో అక్షరదీప్తి పేరిట 200 కవితోక్తులు ప్రచురించారు. తాత్వికతకు తత్వాలకు తేడా వుందనుకుంటే వీటిని తత్వాల కోవలో

# ఆశాదీపాలు

- దేవసేన
9441270979



ఆకాశ దీపాల్లాగా
అందనంత దూరంలో
వినీల విహాయసంలో
మిణుకు మిణుకుమంటూ
మరుగుపడుతున్న మానవ విలువలు
మన మస్తిష్కాలలో
మోసులెత్తి, పరుగులు తీసే
మన పేరాశల, అనంతానంత
పేరాశల మాటున దాగిన లాలసత
నిరంతరం ఏవేవో సుఖాల
ఎండమావుల నెతుక్కుంటూ
బతుకు ఎడారిలో
బాధల్ని మోసుకుంటూ సాగించే
అనంత దుర్భర విషాద సంచారం

ఈ సంక్లిష్ట, సందిగ్ధ సమయాలు
మానవ జీవన వికాస క్రమంలో
అనుక్షణం వేధించే సంక్షుభిత
కల్లోల జీవన కడలిలో
ఎదురయ్యే సుడిగుండాల కడగళ్ళు

ఇక్కడి
కష్టాల సీమలోని కడు పేద వాటికలు
ద్వారాలకు వేలాడే కన్నీటి మాలికలు
నిరాశగా, నిర్వేదంగా
ఆ కళ్ళల్లో గూడుకట్టుకున్న
దిక్కులేని, దిగుళ్ళ దోబూచుల
క్రీనీడల విషాద ఛాయలు
ఇంతటి దుర్భర దారిద్ర్యం
ఇసుమంతైనా సుఖం లేని
చిక్కటి చీకటి రాత్రులలో
తనువొణికించే శీతగాలుల
కంబళ్ళను కప్పుకుంటూ
దుర్భర దారిద్ర్య వేదనను
ఆవాహన చేస్తూ
కర్మాగారాల కాలుష్యాన్ని
ఆశ్వాసిస్తూ
క్షణమొక యుగంగా
రక్షణ లేని రాస్తాలో
నిరీక్షణ చేస్తున్న
అన్నలారా! అన్నార్తులారా!
ఆవేదనా సంక్షుభిత జగాన
దినం దినం
ఈ కూలి జనం, ఈ దీన జనం
ఎదురుచూసే మంచిరోజు
నిజంగా, నిజంగా వస్తుందా?
ఈ బతుకుల బంజర్లలో
రాజనాలు పండేనా?

---

చేర్చడం సముచితమనిపిస్తుంది సంజీవ దేవ్ ముందు మాటలోనూ అదే ధోరణి. ఈ తేడాను భూపాల్ కూడా బాగానే చూపించారు. అయితే రాజకీయ అవగాహనలోనూ ఆయన స్పష్టంగానే వున్నారని చెప్పడానికి ఇందులో దాఖలాలున్నాయి. ఉదాహరణకు తుపాకి గొట్టంతోనే రాజ్యాధికారం సిద్ధిస్తుందన్న అసందర్భ నినాదాన్ని అపహాస్యం చేస్తూ 1993లో రాసిన కవితలో నాడా కోసం గుర్రం కొనడం ఎలాంటిదో తుపాకీనే సర్వస్వమన్న భావన కూడా అలాంటిదేనని చక్కటి పోలిక చూపించారు. సుదీర్ఘ కాల కృషి త్యాగాలు పోరాటాలు లేకుండా మార్పు రాదని స్పష్టంగా చెబుతాడు. ఈ పరిశోధనలో పొట్లపల్లి జీవిత సాహిత్యాలను తులనాత్మకంగా అంచనా కట్టడంతో పాటు అతిశయోక్తిగా కీర్తించే ధోరణి కూడా కొంత వుందని చెప్పాలి. పొట్లపల్లి తండ్రి శ్రీనివాసరావు గురించి చెబుతూ 'దొరతనం ఉట్టి పడేది' నూటికి నూరు పాళ్లు దొర వంటి పదాలు రాసేప్పుడు మరింత జాగ్రత్త పడి వుండాల్సింది.

తెలంగాణా ప్రాంతంలోని తొలినాళ్ల రచయితలు, కవులు చాలామందికి రావలసినంత గుర్తింపు, ప్రాధాన్యత రాకపోవడానికి కేవలం వ్యక్తిగతమైన లేదా ప్రాంతీయమైన పొరపొచ్చాలే కారణమనుకుంటే చరిత్రకు న్యాయం జరగదు. ఆ నాటి రాజకీయ భౌగోళిక సాంస్కృతిక నేపథ్యంలోనే వాటిని అర్థం చేసుకోగలం. ఆ తర్వాతనే ఇతర అంశాలు. ఏమైనా ఆ అపార్థాలను ఉభయత్రా తొలగించుకోవడం కూడా ప్రజాతంత్ర వాదుల బాధ్యత. ఎందుకంటే పాలకులకు పీడకులకు అసమానతలు అవసరం గాని అశేష జనసామాన్యానికి వారి పక్షాన నిలిచే అభ్యుదయ భావుకులకు ఎలాంటి అంతరాలు వుండవు. ఇప్పటి ప్రాంతీయ రాజకీయాల అద్దంలో పొట్లపల్లి వంటి పెద్దలను చూడనవసరం లేదు. చూపనవసరం లేదు.

పొట్లపల్లిపై అంకిత భావంతో పరిశోధన చేసి అనేక విషయాలు వెల్లడించడమే గాక నాటి ఫోటోలు, ఉత్తరాలు, అరుదైన ప్రతులు కూడా జత చేసి అందంగా అందించిన భూపాల్ అభినందనీయుడు. బాలసాహిత్యంలో ప్రవీణుడైన ఆ మిత్రుడు పరిణిత రచయితను విశ్లేషించడంలో పట్టు చూపించడం మరింత విశేషం పొట్లపల్లి కుటుంబ సభ్యులు ఇందుకు సహకరించి భాగం పంచుకోవడం కూడా మంచి విషయం.

- తెలకపల్లి రవి

## కొత్త పుస్తకం

# అమానుష వ్యవస్థకు ప్రతిబింబం 'సారాజ్జెం'

వొరప్రసాద్




సమాజ పరిణామంలో చోటుచేసుకున్న అనేక అంశాలు మనకు తెలియవు. చరిత్ర కోణంలో కొన్ని విషయాలను తెలుసుకోగలం. ఆ చరిత్ర అధ్యయనానికి సాహిత్యం ఒక ప్రధాన ఆధారం. కథలు, నవలలు వంటి సాహిత్యం ద్వారా ఆనాటి ప్రజల రోజువారీ జీవితం మనకు చాలావరకు తెలిసే అవకాశం ఉంటుంది. ఇటీవల పునర్ముద్రించిన అక్కినేని కుటుంబరావు నవల 'సారాజ్జెం' కూడా అటువంటి పుస్తకమే. స్వాతంత్ర్యకాలం నాటి ఒక తెలుగు గ్రామంలోని ప్రజల సజీవ జీవన చిత్రణ ఈ నవల. స్వాతంత్ర్యం వచ్చి అరవై ఐదు సంవత్సరాల కాలం గడిచిపోయిన తర్వాత ఈ నవల చదవడం చాలా అవసరం. అణగారిన ప్రజల కోణంలోంచి వాస్తవికంగా వ్యక్తీకరించబడిన ఒకనాటి గ్రామజీవితం ఈ నవల. కరడు కట్టిన పెత్తందారీ కులవ్యవస్థ విశ్వరూపం ఈ నవల. ఆనాటి ప్రజల సజీవ జీవితాన్ని కళాత్మకంగా వ్యక్తీకరించిన నవల "సారాజ్జెం".

"తెల్లగా వెన్నెలొచ్చింది- మాలపల్లిక్కూడా; వెన్నెల ఆకాశం మీద నించొచ్చేది కాబట్టి గానీ, లేకపోతే దొరలు మాలపల్లికి వెన్నెల్ని రానిచ్చేవారు కారేమో;" ఈ వాక్యాలు చదివిన పాఠకుడికి మనసులో వెంటనే చాలా విషయాలు స్ఫురిస్తాయి. మాలపల్లి ఎదుర్కొన్న వివక్ష, అణిచివేత, దౌర్జన్యం, అవమానాలు అన్నింటినీ ఈ రెండు వాక్యాలూ వ్యక్తం చేస్తాయి. నవలంతా ఈ రెండు వాక్యాలనూ బలపరిచే సంఘటనలను, పరిణామాలనూ దృశ్యమానం చేస్తూ సాగుతుంది.

మాలపల్లెలోని ఎంకడి కుటుంబం కేంద్రంగా నవల నడుస్తుంది. ఎంకడి భార్య పద్దాలు. కొడుకు తిరుపతి. తర్వాత కూతురు 'సారాజ్జెం'. సారాజ్జెం పుట్టడం, మన దేశానికి స్వాతంత్ర్యం రావడం నవలకి ప్రారంభం. ఈ నవలలోని ప్రధాన పాత్ర 'సారాజ్జెం' సరిగ్గా స్వాతంత్ర్యం వచ్చిన సమయానికి పుట్టడం వల్ల ఆ గ్రామ పెద్ద బ్రాహ్మం ఆమెకు 'సారాజ్జెం' పేరు పెడతాడు. ఆ స్వరాజ్యం సంగతి కానీ, దేశ స్వాతంత్ర్యం వంటి విషయాలనేవి కానీ ఏమాత్రం తెలియని 'సారాజ్జెం' తల్లి 'పద్దాలు', తండ్రి 'ఎంకడు' బ్రహ్మంగారి నిర్ణయానికి తల ఆడిస్తారు. ఆ గ్రామంలో 'సారాజ్జెం' పుట్టిన దగ్గర్నుండి ఎదిగే వరకూ జరిగిన పరిణామాలను రచయిత కథనం చేస్తాడు. గ్రామానికి, మాలపల్లె ప్రజల జీవితాలకీ ఉన్న జీవన వ్యత్యాసం చాలా స్పష్టంగా ఈ నవలలో కనపడుతుంది. ఎంకడి కొడుకు తిరుపతి ఓ భూస్వామి దగ్గర పాలేరుగా జీతముంటాడు. చాలా మంచి పనిమంతుడుగా పేరుతెచ్చుకుంటాడు. మాలపల్లెలోని యువకుల బృందానికి తిరుపతి కేంద్రంగా ఉంటాడు. ఆ యువకుల్లో కొంత చైతన్యం వస్తుంది. ఇది గమనించిన గ్రామ భూస్వాములు తిరుపతి యజమాని మీద ఒత్తిడి తెస్తారు. ఏదో సాకుతో తిరుపతిని పాలేరు పనిలోంచి తీసేస్తాడు ఆ భూస్వామి. తిరుపతి రోజూ కూలిపనులకు వెళ్ళడం మొదలెడతాడు. కూలిరేట్లు పెంచాలని గ్రామ భూస్వాములను అడుగుతారు. ఆ విషయంలో భూస్వాములంతా ఒకటయి వేరే గ్రామం నుండి కూలీలను తెప్పించడానికి ప్రయత్నిస్తారు. తిరుపతి బృందం కూడా ఆయా గ్రామాలకు వెళ్ళి అక్కడి కూలీలకు అంతా వివరించి వాళ్ళు రాకుండా చేస్తారు. ఆ గ్రామాల నుండి తిరిగి వస్తున్నప్పుడు తిరుపతిని, మరో ఇద్దరు మిత్రులను భూస్వాముల మనుషులు దారిలో చంపి వాగులో పడేస్తారు. దాంతో గ్రామంలోని కూలిరేట్ల ఆందోళన మరుగున పడిపోతుంది. హత్య చేయించిన భూస్వామి కొంత భూమి అమ్ముకుని కేసు నుంచి బయటపడతాడు. తిరుపతి చనిపోయిన తరువాత ఎంకడికి వెర్రితనం వచ్చి ఏ పనీ చేయడు. ఎంకడి భార్య పద్దాలు 'సారాజ్జెం' ను గ్రామంలోని అగ్రకుల కుటుంబంలో పనిమనిషిగా పెడుతుంది. ఆ కుటుంబాలలోని ఆధిపత్య ధోరణి 'సారాజ్జెం' అడుగడుగునా ఎదుర్కొంటుంది. కొన్నాళ్ళకు సారాజ్జెం తండ్రి ఎంకడు కూడా చనిపోతాడు. మగదిక్కులేని పద్దాలు, సారాజ్జెం చాలా కష్టంగా కాలం వెళ్ళదీస్తుంటారు. ఇళ్ళల్లో పనిమనిషిగా చేయడం మానేసి పొలం పనులకు వెళ్ళడం ప్రారంభిస్తుంది సారాజ్జెం. రోజురోజుకీ మాలపల్లె జనాలకు పని దొరకడం కష్టమవుతుంటుంది. కొంత మంది వలసపోతుంటారు. గ్రామంలోని రైతులు నైజాం ప్రాంతం నుండి కూలీల కుటుంబాలను తీసుకువస్తారు. గ్రామంలోని మాలపల్లె జనానికి వలస పోవడం తప్ప మరో మార్గం ఉండదు. నైజాం కూలీలు వచ్చిన తర్వాత పనులు దొరకడం మరీ కష్టమవుతుంది. మాలపల్లె జనాలు వలసపోతుంటే తల్లిని తీసుకుని తనూ బయలుదేరుతుంది సారాజ్జెం. అక్కడితో నవల ముగుస్తుంది. స్థూలంగా కథ ఇదయినా నవలలో వర్ణించబడిన జీవితం పాఠకుడికి చాలా విషయాలు చెబుతుంది.

ఆనాడు నెలకొన్న గ్రామీణ వ్యవస్థకు నమూనాగా ఆ గ్రామం ఈ నవలలో మనకు కనిపిస్తుంది. అనేక మాలపల్లెలకు ఆ వూరి మాలపల్లె ప్రాతినిధ్యం వహిస్తుంది. ఈ దేశంలో ఒక దుర్మార్గ పెత్తందారీ కులవ్యవస్థ ఎంతటి విధ్వంసాన్ని సృష్టించిందో ఈ నవల మనకు అర్థం అవుతుంది. కనీసం ఆత్మగౌరవం లేకుండా ఎందరి జీవితాలను ఈ వ్యవస్థ తన పొట్టనబెట్టుకుందో అన్పిస్తుంది. ఎన్ని రకాలుగా మాలపల్లెలోని మనుషులను దోపిడీ చేసారో ఈ నవల వ్యక్తం చేస్తుంది. కనీస హక్కులు దీనంగా అడిగినా కనికరించకుండా వాళ్ళు చేసిన దారుణాలు ఆగ్రహం తెప్పిస్తాయి. సారాజ్జెం తల్లి ప్రసవ

వేదన పడుతూ ఆసుపత్రి సౌకర్యం లేక నరకం అనుభవిస్తుంది. ఎక్కడకూ తీసుకెళ్ళలేని నిస్సహాయతలో భార్య పద్దాలు ప్రసవ వేదన పడుతుంటే 'దేవతలకు' మొక్కుకుంటూ గుడిసె బయట ఎంకడు మధనపడుతుంటాడు. ఊర్లో అందరికీ ప్రసవాలు చేసే చాకలి ఈరమ్మ ఆ సమయానికి ఉండదు. చివరి క్షణంలో ఆమె వస్తుంది. కుక్కిమంచంలో ప్రసవ వేదన పడుతున్న పద్దాలును చూస్తుంది వీరమ్మ. ఆ గుడిసెలోని కుక్కిమంచం పరిస్థితిని చూసి అక్కడి వాళ్ళను తీవ్రంగా తిడుతుంది. కింద నేల మీద పాత బట్టలు పరిచి పద్దాలుకు ప్రసవం అయ్యేలా చేస్తుంది. ఈ దృశ్యంతో నవల ప్రారంభమవుతుంది.

గ్రామమంతా నిద్రకు ఉపక్రమిస్తుంటే రైతుల ఇళ్ళలో పనులన్నీ ముగించుకుని మాలపల్లె జనం ఇళ్ళకు చేరుకుంటుంటారు. వారి గురించి రచయిత చెప్పిన తీరు కదిలిస్తుంది- 'పనులన్నీ ముగించుకొని కొంప కొచ్చేసరికి రాత్రి ఏడెనిమిదవుతుంది. పల్లెటూళ్ళలో ఏడెనిమిదంటే అంతా సగం నిద్రల్లో వుంటారు- మాలపల్లిలో తప్ప. అప్పుడప్పుడే పనులు ముగించుకుని ఇళ్ళకు చేరుకుంటుంటారు కాబట్టి నలుగురూ బజారుల్లో ఎదురుపడుతూ "మంచి సెబ్బరా" మాట్టాడుకుంటుంటారు. చిన్న పాలేళ్ళు వగలంతా పన్జేసి అలిసిపోయుండటం మూలాన నడుస్తూనే సగం సగం నిద్రోతూ నడుస్తాంటారు.'' మాలపల్లెలోని పిల్లల నుండి పెద్దల వరకూ గ్రామంలోని రైతు కుటుంబాల ఇళ్ళల్లోనూ, పొలాల్లోనూ పనిచేయాల్సిందే. మరో మార్గం లేదు. మాలపల్లె జనాలంతా గ్రామంలోని భూస్వాములు, రైతుల మీద ఆధారపడి మాత్రమే జీవనం కొనసాగించేలా వ్యవస్థ తీర్చిదిద్దబడి ఉండడాన్ని ఈ నవల చూపిస్తుంది. అది అవకాశంగా తీసుకుని మాలపల్లె జనాలపై ఆర్థికంగా, సామాజికంగా, లైంగికంగా ఆ గ్రామం దాష్టీకం సాగించడం సహజంగా ఈ నవలలో చిత్రించారు కుటుంబరావు. మాలపల్లె యువకుడిని దొంగతనం చేసాడని తలకిందులుగా వేలాడదీసి నిప్పంటిస్తారు. మాలపల్లెలో పేదప్రజలకోసం పోరాడే సుబ్బారావు దాక్కున్నాడని అక్కడి వాళ్ళందరి మీదా పోలీసులు దౌర్జన్యం చేస్తారు. గ్రామపెద్ద బ్రహ్మం, సుబ్బారావును పట్టించి ఎన్‌కౌంటర్ చేయిస్తాడు.

రాజకీయ, ఆర్థిక పెత్తనంతో పాటు కులపరంగా మాలపల్లెను అణిచివేసిన తీరును శక్తివంతంగా చిత్రించారు రచయిత. మాలపల్లె ప్రజల దయనీయ స్థితిని వర్ణించిన తీరు పాఠకుడికి వేదన కలిగిస్తుంది. ఆనాటి గ్రామ జీవన స్థితిని ఈ నవలలో అత్యంత సహజంగా చిత్రించారు. ఈ నవల విస్తృతంగా చదవదగ్గది. భూస్వామ్య భావజాలంతో కూడిన కులవ్యవస్థ మనుషుల ఆత్మగౌరవాన్ని ఎంతగా అవమానపరుస్తుందో ఈ నవల చాటుతుంది. దళిత స్పృహ, చైతన్యం పెరిగిన కాలంలో ఈ నవల చర్చకు రాకపోవడం ఆశ్చర్యమే. గతకాలంలోని సమాజ చిత్రాన్ని వాస్తవికంగా రికార్డు చేసింది ఈ నవల. ఆనాటికి దళిత వాదం కానీ, దళిత చైతన్యం కానీ లేవు. రచయిత మీద అటువంటి ప్రభావం ఏమీ లేదు. రచయిత ఈ నవలకు రాసిన ముందుమాటలో దళితుల పట్ల తనకు సాఫ్ట్‌కార్నర్ ఎందుకు వచ్చిందో అంటూ... అవును మా వూరులో కమ్యూనిస్టులు ఉన్నారు అని రాసారు. రచయిత ఈ నవలలోని గ్రామం తన సొంత గ్రామం అని చెప్పారు. దీన్నిబట్టి ఈ నవల వాస్తవికతకు ఎంత దగ్గరగా ఉందో అర్థమవుతుంది. ఈనాటి సమాజాన్ని ఆనాటి సమాజం పోల్చుకుని సారాంశాన్ని గ్రహించడానికి ఈ నవల తోడ్పడుతుంది.

ఒక చిత్రకారుడు తెలుగునాట ఒక గ్రామాన్ని ఉన్నది ఉన్నట్టుగా చిత్రిస్తే ఆ గ్రామం 'సొరాజ్జెం' నవలలోని గ్రామంలా ఉంటుంది. ఆనాటి ఒక గ్రామాన్ని వీడియో చిత్రీకరణ జరిపితే ఆ గ్రామం ఈ నవలలోని గ్రామంలా ఉంటుంది. పెత్తందారీ పోకడలు, ఆత్మగౌరవం కాపాడుకోలేని పరిస్థితులలో జీవిస్తున్న మనుషుల వేదనలు మన మనసులను కదిలించేలా ఈ పుస్తకంలో చిత్రించారు రచయిత. అగ్రవర్ణం పద్ధఘట్టనల కింద నలిగిపోయిన 'మాలపల్లి'ని ఈ నవలలో మన కళ్ళకు కట్టిస్తారు రచయిత.

> ***ఈ నవలను చదివినప్పుడు ఒక్క కుదుపుకు లోనవుతాం. ఆ నవలలోని అమానుషం చదువుతున్న వారిలో అలజడి రేపుతుంది. వాస్తవిక సజీవ జీవన చిత్రణ పాఠకుడిని తనలో లీనం చేసుకుని ఊపిరితీసుకోనివ్వదు. చరిత్రలో ఒక చేదు కాలాన్ని ఉన్నదున్నట్టుగా రికార్డు చేసిన నవల ఇది. నిజానికి ఈ పుస్తకం ఇప్పటికే ఎన్నో ముద్రణలు రావాల్సింది. కొన్ని పుస్తకాలు సాహిత్యం ప్రాధాన్యతనూ, రచయితల ప్రత్యేకతనూ గుర్తించేలా చేస్తాయి. సాహిత్య ప్రయోజనం, రచయిత ప్రాధాన్యతలను ఈ పుస్తకం మరింతగా నొక్కి చెప్పిందనిపించింది.***

ఈ నవలను చదివినప్పుడు ఒక్క కుదుపుకు లోనవుతాం. ఆ నవలలోని అమానుషం చదువుతున్న వారిలో అలజడి రేపుతుంది. వాస్తవిక సజీవ జీవన చిత్రణ పాఠకుడిని తనలో లీనం చేసుకుని ఊపిరితీసుకోనివ్వదు. చరిత్రలో ఒక చేదు కాలాన్ని ఉన్నదున్నట్టుగా రికార్డు చేసిన నవల ఇది. నిజానికి ఈ పుస్తకం ఇప్పటికే ఎన్నో ముద్రణలు రావాల్సింది. కొన్ని పుస్తకాలు సాహిత్యం ప్రాధాన్యతనూ, రచయితల ప్రత్యేకతనూ గుర్తించేలా చేస్తాయి. సాహిత్య ప్రయోజనం, రచయిత ప్రాధాన్యతలను ఈ పుస్తకం మరింతగా నొక్కి చెప్పిందనిపించింది. ఈ నవల చదివితే కరడు గట్టిన అమానుష వ్యవస్థను పెకిలించలేని నిస్సహాయత నుండి ఒక దుఃఖసముద్రం వెల్లువలా పొంగుతుంది. ఊరికి ఎడంగా ఉండే మాలపల్లి బతుకులను ఈ దేశం ఎలా నిర్దేశించిందో ఈ పుస్తకం తేటతెల్లం చేసింది. అగ్రకులాలకు ఊడిగం చేయడం తప్ప ఏ మాత్రం తమ గురించి ఆలోచించేపరిస్థితి లేని జనం కథ ఇది. అత్యంత సహజంగా నిరాపేక్షంగా, నిరావేశంగా చిత్రించిన ఒక గొప్ప సృజనకారుడి చిత్రణ ఈ నవల. రెక్కలు ముక్కలు చేసుకుని కష్టపడే ఎంకడి కుటుంబం దయనీయ జీవితం గుండెను బరువు చేసి వదులుతుంది. కాలం గడిచే కొలదీ ఈ పుస్తకానికి విలువ పెరుగుతుంది. ఈ తరంతో కలిసి తర్వాతి తరం వారికి కూడా ఈ పుస్తకం చాలా విషయాలు చెప్తుంది. కొన్ని కాలగమనంలో అదృశ్యం అయిపోతాయి. ముఖ్యంగా దుర్మార్గపు వ్యవస్థ తాలూకూ కొన్ని రూపాలు అదృశ్యం అవటం మంచి విషయమే. కానీ అవి తెలిస్తేనే ముఖ్యంగా వర్తమానంలో మనం ఎలా ఉన్నాం. మన గతం ఏమిటి? అనేది అర్థమవుతుంది. అందుకు ఇలాంటి పుస్తకాలు మరీ మరీ అవసరం.

♦

## నవజీవన యదార్థగాథ

బండి శ్రీనివాస్ యాదవ్
9848315190

ఇది మన ప్రభుత్వం
ఇక్కడ కొట్లాటలే నిత్యం
అసమర్థపాలన
సవతి తల్లి లాలన
లెదెక్కడ శాంతి
లేదెవ్వరికీ మనశ్శాంతి
కానరాదు నీతి
అడ్డులేని అవినీతి
నిలకడలేని ముఖ్యమంత్రులు
పొంతన లేని మంత్రులు
అధికార మోజు
నాయకులకు పట్టిన బూజు
అధికారుల నిర్లక్ష్యం
ధనార్జనే లక్ష్యం
అక్రమార్కుల ఆగడాలు
విక్రమార్కుల వినోదాలు
అవినీతి పథకాలు
మొలకెత్తని విత్తనాలు
పెరిగిన ప్రాంతీయవాదం
రగిలింది రాజకీయవాదం
పెరిగిపోయిన కుంభకోణాలు
నిలువునా పోయేను
మంది ప్రాణాలు
ఇది ప్రజాస్వామ్యం
చెలరేగిన భూస్వామ్యం
ఏరులై పారుతున్న మద్యం
ప్రభుత్వ అధికారుల చోద్యం
పోలీసుల ఎన్‌కౌంటర్లు
కూలుతున్న హెలికాప్టర్లు
పెడదారి పట్టిన యువత
ఏమౌతుందో వారి భవిత
రైతన్నే వెన్నెముక
మద్దతు ధరే కరువిక
బీద ప్రజల బతుకులు
పట్టెడైనా లేని మెతుకులు

**విద్యార్థి కవిత**

రూపాయికే కిలోబియ్యం
ఎరువుల కోసం కయ్యం
విద్యార్థుల బలిదానాలు
తల్లిదండ్రుల ఆర్తనాదాలు
అన్నదాతల ఆత్మహత్యలు
రౌడీషీటర్ల హత్యలు
అబ్బాయిల యాసిడ్
దాడులు
అమ్మాయిల వేదన
గోడులు
ప్రతీరోజూ బంద్‌లు
మనకు పెడతాయా
విందులు
పెరిగిపోతున్న ప్రమాదాలు
మిగిలిపోతున్న అనాథలు
అక్రమ బొగ్గు గనులు
అందులో మనవారు 'ఘనులు'
నింగినంటిన ధరలు
లేరెవ్వరూ దానికి దొరలు
పేద ప్రజల అమాయకత్వం
పెరిగిపోయిన అలసత్వం
మందగించిన మనస్తత్వం
మంటగలిసెను, మానవత్వం
ప్రైవేటు చదువులు
నేలరాలిన పూవులు.
డబ్బున్నవారి పన్నాగం
న్యాయ వ్యవస్థ అగమ్యం
2జీ స్కాంలు
అంతులేని స్కీములు
ప్రజలేం చేశారు నేరం
మరెక్కడా లేదీ ఘోరం
ప్రజాస్వామ్యం కాదిది
పేట్రేగిన ఉన్మాదం
జాగ్రత్త మిత్రమా
అణగదొక్కుతారు సుమా !

## మొగ్గ

వై. రామకృష్ణారావు
8985743964

మొగ్గలో
భవిష్యత్తు దోబూచులాడుతుంటుంది
లేతరేకులు ఒకదానినొకటి
దగ్గరగా ఆచ్ఛాదించుకొని
బిగుతుగా చుట్టుకొన్న అమరికలో
ఒదిగి ఉన్న మొగ్గ
ఫెళ్ళున
రేపు ఆవిష్కృతమయ్యే
రంగుల స్వప్నానికి భూమిక
మధుప సంగీతానికి వేదిక
సిగలో వెలిగినా
శిలపై రాలినా
పువ్వు వర్తమానమే
వెన్నెల కిరణాల్లో
ఆశల సంగీతాన్ని
మీటుకునే స్వాప్నికుడు
మొగ్గతనానికి
రేపును కాంక్షిస్తాడు
పువ్వుకులేని రేపు
మొగ్గకే ఉంది!
అందుకే
మొగ్గపై ఆశలుంచుకో
పువ్వుతో ప్రేమ పంచుకో



# అన్నా రాజకీయం సరికొత్త సందేహాలు



తెలకపల్లి రవి

**అత్యధిక ప్రచారం పొంది ప్రభంజనంగా కనిపించిన ఒక వ్యక్తి కేవలం ఒక ఏడాది కాలంలో ఇంత పేలవమైన ప్రతిస్పందనతో మిగిలిపోవడం అరుదే అయినా అసహజం కాదు. వ్యవస్థాగత అంశాలు వదిలిపెట్టి వ్యక్తిగత పోకడల చుట్టూ పరిభ్రమిస్తే కలిగే ఫలితం ఇలాగే ఉంటుంది. వ్యక్తులు స్వీయారాధనలో పడిపోయి ఇచ్ఛానుసారం అన్నీ జరిగిపోతాయనుకుంటే పరిస్థితి తలకిందులవుతుంది.**

అపర గాంధీ స్థాయిలో ప్రచారం పొందిన అవినీతి వ్యతిరేక ఉద్యమకారుడు అన్నా హజారే రాజకీయ వేదిక స్థాపిస్తానని చేసిన ప్రకటనపై పెద్దగా హర్షాతిరేకం వ్యక్తం చేసిన వారెవరూ లేరు. కానీ ఆయన గత వైఖరికీ, దీనికి మధ్య వ్యత్యాసం పట్టి చూపినవారు, ఆ వేదిక భవిష్యత్తుపై నిర్లిప్తత వ్యక్తం చేసిన వారు చాలా ఎక్కువగా ఉన్నారు. అత్యధిక ప్రచారం పొంది ప్రభంజనంగా కనిపించిన ఒక వ్యక్తి కేవలం ఒక ఏడాది కాలంలో ఇంత పేలవమైన ప్రతిస్పందనతో మిగిలిపోవడం అరుదే అయినా అసహజం కాదు. వ్యవస్థాగత అంశాలు వదిలిపెట్టి వ్యక్తిగత పోకడల చుట్టూ పరిభ్రమిస్తే కలిగే ఫలితం ఇలాగే ఉంటుంది. వ్యక్తులు స్వీయారాధనలో పడిపోయి ఇచ్ఛానుసారం అన్నీ జరిగిపోతాయనుకుంటే పరిస్థితి తలకిందులవుతుంది. అన్నా హజారే ఒకటికి రెండుసార్లు నిరాహారదీక్షలు ప్రకటించడం, విరమించడం, ఆ దీక్షా శిబిరంలో బృంద సభ్యుల మధ్యనే విభేదాలు కనిపించడం ఇవన్నీ మెరుపును తగ్గించేశాయి. వాస్తవానికి మొదటి నుంచీ ఆయన ఆందోళనలో వైరుధ్యాలకు లోటు లేదు.

మొదట్లో అవినీతికి వ్యతిరేకంగా అన్నా హజారే నిరాహార దీక్షకు దేశవ్యాప్తంగా వచ్చిన స్పందన, అత్యంత అవినీతిపరులు కూడా అతి బిగ్గరగా సంఘీభావం తెల్పడం అనూహ్యమైనదేమీ కాదు. తన దీక్ష దగ్గరకు రాజకీయవేత్తలెవరూ రాకూడదని శాసించిన అన్నా హజారే రాజకీయ బాబాగా అభివర్ణించబడే రామ్‌దేవ్‌ను సలక్షణంగా స్వాగతించారు. అధికార వ్యవస్థలో భాగంగా చాలా కాలం ఉన్న కిరణ్ బేడీని ప్రముఖంగా ముందు నిలిపారు. బిజెపికి సన్నిహితులైన మేధావులు అనేక మంది అక్కడ సాక్షాత్కరించారు. ఆఖరులో నరేంద్ర మోడీని, నితీష్ కుమార్‌ను కీర్తించడంతో ఆనాటి ఆయన దీక్ష ముగిసింది. తమను మెచ్చుకున్నందుకు నితీష్ కుమార్ నమ్రత ప్రకటిస్తే, మోడీ మరింత గడుసుగా ఇది విమర్శలకు దారి తీస్తుందేమోనని ముందు జాగ్రత్త ప్రదర్శించారు.

దేశం ముందున్న సమస్య అవినీతి అని సాక్షాత్తూ మాజీ రాష్ట్రపతి ప్రతిభా పాటిల్ 2011 గణతంత్ర దినోత్సవ సందేశంలోనే చెప్పారు. అవినీతిపరులని తెలిసినా అధికారం కోసం రాజా వంటి వారిని చేర్చుకోక తప్పడం లేదని మన్మోహన్‌సింగ్ ఆ వెంటనే వెల్లడించారు. కనక వ్యవస్థీకృతమైన అవినీతి మూలాలు చూడకుండా కాయకల్ప చికిత్సలపై కదన శంఖాలు ఎంతగా పూరించినా వేళ్ళు వదిలి కొమ్మను విరిచిన చందంగానే మిగిలిపోతుంది. అనేక విధాలైన ఆర్థిక దోపిడీలపై ఆధారపడిన ధనస్వామ్య వ్యవస్థ సరళీకరణ యుగంలో మరీ దుర్గంధభరితమై, దుర్మార్గమై పోయిందనేది అసలు వాస్తవం. అవినీతి పాతకాల సరళీకరణ తప్ప పరిష్కారాల సరళీకరణ కాదు. వామపక్షేతర పార్టీలన్నీ నేతల రీతులు ఏవైనా సరళీకరణను భుజాన మోస్తూనే ఉన్నాయి. ప్రపంచ బ్యాంకు ప్రవచిత విధానాల అనివార్య ఫలితం అవినీతి అని అంతర్జాతీయ అనుభవమూ చెబుతున్నది. విప్లవాత్మకమైనదిగా వర్ణించబడిన సూక్ష్మ రుణ పిత, నోబెల్ బహుమతి గ్రహీత మహ్మద్ యూనస్ అవినీతి ఆరోపణపై బోనెక్కడం దీనికో

ఉదాహరణ. పౌర సమాజం పేరుతో ప్రభుత్వేతర సంస్థలు (ఎన్‌జివోలు) ప్రతిదాన్నీ నడిపించాలని చెప్పడం చాలా ఆకర్షణీయంగా ఉంటుంది. కానీ వాస్తవంలో అది ప్రాతినిధ్య ప్రజాస్వామ్య సూత్రాలనే ప్రశ్నిస్తుంది. పైగా ప్రభుత్వాలనే కొనుగోలు చేయగల అంతర్జాతీయ తిమింగలాలు ఈ సంస్థల ప్రతినిధులను ప్రభావితం చేయలేవనుకోవడం కూడా అసంబద్ధమే.

లోక్‌పాల్ పట్ల స్థూలమైన ఏకాభిప్రాయం ఉంది గనక అందరూ అన్నా దీక్షలను సమర్థించారు. ఒక దశలో ప్రభుత్వం కూడా ఆయన బృందం సూచనలు తీసుకుని లోక్‌పాల్ ముసాయిదాను పునః పరిశీలించేందుకు సిద్ధమైంది. వరుస కుంభకోణాల్లో చిక్కిన మన్మోహన్ సింగ్ ప్రభుత్వం అన్నా హజారే ఆందోళనకు స్పందిస్తున్నట్టు నటించడం ద్వారా తన ఇరకాటాన్ని కాస్త సర్దుకోగలిగింది. ప్రధాని ఆ అవినీతికి అతీతుడైనట్టుగా తతంగం నడిపే అవకాశం కలిగింది. ఇది నిజానికి పరోక్ష ప్రయోజనం. ఈ పరిస్థితి మారగానే దిగ్విజయ్ సింగ్ వంటివారు నేరుగా అన్నా బృందంతో వాగ్వివాదాలు పెంచుతూ వచ్చారు. మార్మిక యోగి రామ్‌దేవ్ రంగ ప్రవేశంతో అవినీతి వ్యతిరేక ఉద్యమం మరింతగా పట్టాలు తప్పింది. కాంగ్రెస్ ప్రభుత్వ నేతలు ఆయనను రాజలాంఛనాలతో స్వాగతించారు. ఆయన దీక్ష ప్రారంభించడానికి ముందే దాన్ని విరమించే విషయమై తమకు లేఖ రాశారంటూ ప్రభుత్వం ఆ ప్రతులు విడుదల చేసింది. దీక్షా శిబిరం కోసం భారీ ఎత్తున కార్పొరేట్ స్థాయిలో జరిగిన ఏర్పాట్లపై సమాచార హక్కు చట్టం కార్యకర్త అరుణ్ రాయ్ స్వయంగా ధ్వజమెత్తారు. దీక్షా శిబిరంలో సాధ్వీ రితంబరి లాంటి కరుడు గట్టిన మతోన్మాద శక్తులు ప్రత్యక్షమయ్యారు. ఆయనను ప్రభుత్వం అరెస్టు చేసినప్పుడు సంభవించిన సంఘటనలు, చేసిన ప్రకటనలు మరింత గందరగోళం పెంచాయి. అరెస్సెస్, బిజెపిలు, వాటి అనుకూల మీడియా ఇదే ఏకైక ఎజెండాగా హడావుడి సాగిస్తూ రామ్‌దేవ్‌ను నిస్వార్థ దేశభక్తుడైన జయప్రకాశ్ నారాయణ్‌తో పోల్చి చూపించడం దిగ్భ్రాంతికరంగా మారింది. అన్నా, రామ్‌దేవ్ బాబాల మధ్య తేడా ఉన్నా వారి మధ్య సంబంధాలు కూడా పరిపరి విధాల మారుతూ వచ్చాయి.

***లోక్‌పాల్ పట్ల స్థూలమైన ఏకాభిప్రాయం ఉంది గనక అందరూ అన్నా దీక్షలను సమర్థించారు. ఒక దశలో ప్రభుత్వం కూడా ఆయన బృందం సూచనలు తీసుకుని లోక్‌పాల్ ముసాయిదాను పునః పరిశీలించేందుకు సిద్ధమైంది. వరుస కుంభకోణాల్లో చిక్కిన మన్మోహన్ సింగ్ ప్రభుత్వం అన్నా హజారే ఆందోళనకు స్పందిస్తున్నట్టు నటించడం ద్వారా తన ఇరకాటాన్ని కాస్త సర్దుకోగలిగింది. ప్రధాని ఆ అవినీతికి అతీతుడైనట్టుగా తతంగం నడిపే అవకాశం కలిగింది. ఇది నిజానికి పరోక్ష ప్రయోజనం.***

ఏది ఏమైన లోక్‌పాల్ బిల్లు, అవినీతి నిర్మూలన అనే కోర్కెలపై ప్రజాస్వామికవాదులు ఎప్పుడూ మద్దతు చెబుతూనే ఉన్నా మూల కారణాలు పట్టించుకోవాలని వామపక్షాలు నొక్కి చెబుతూ వచ్చాయి. మరోవైపు అన్నాదీక్షలు, అరెస్టులు ఒక రివాజుగా మారాయి.

లోక్‌పాల్ బిల్లు 42 ఏళ్లలో ఎనిమిది సార్లు వెనక్కు పోయిందంటే పాలకులకు దాన్ని తీసుకురావడం పెద్దగా ఇష్టం లేదనేది స్పష్టం. ఇప్పుడు జరుగుతున్నది కూడా అదే. ఎప్పటికైనా ఆ బిల్లు తెచ్చినప్పటికీ అంతటితోనే అవినీతి ఆగిపోతుందని కాదు. నిబంధనల ఉల్లంఘన అవినీతి అనడం ఒకటైతే, అసలు నిబంధనలే అంతర్జాతీయ బేహారులకు అనుకూలంగా ఉన్నప్పుడు చేయగలిగిందేమిటి? బ్రహ్మణి స్టీల్స్ అమ్మకంపై వచ్చిన కథనాలు గానీ, అంతకు ముందు ఎమ్మార్ వ్యవహారం గానీ ఏమి చెబుతున్నాయి. నిబంధనల నిర్ణయంలోనే ప్రజల వనరులను గుత్తాధిపతులకు కట్టబెట్టే ఏర్పాటు జరిగాక చట్టబద్ధంగానే అవినీతి జరిగిపోతుంది. అవినీతి పడగ నీడ పుస్తకం ప్రపంచ బ్యాంకు ప్రతిచోటా అవినీతిని పెంచి పోషిస్తున్న తీరును సోదాహరణంగా వివరిస్తుంది. అన్నా హజారే వంటి వారి మాటలలో సామ్రాజ్యవాదం, ప్రజా వనరుల ప్రైవేటీకరణ వంటి అంశాలే ఉండవు. అందుకే ఇది పాక్షికమైన వ్యవహారం.

ఈ పాక్షికత్వం ఇంకా ఇతర విధాలుగానూ కనిపిస్తుంది. నరేంద్ర మోడీ పాలనలో గుజరాత్‌లో సాగిన జాతి హత్యాకాండ దేశమంతటి ఖండనకు గురైంది. మోడీపై ఇతర ఆరోపణలు అటుంచి రాజకీయాధికారం కోసం మత మారణహోమాన్ని సృష్టించడం అవినీతిని మించిన అఘాయిత్యం. మోడితో కలిసి ఎన్నికల ప్రచారానికే నిరాకరించిన నితీష్‌ను కూడా కలిపి పొగడటం ఒక వైపరీత్యం. ఇదే సమయంలో నిరాడంబరంగా నామినేషన్ వేసి స్వంత ఇల్లు లేదని ప్రకటించిన బుద్ధదేవ్ భట్టాచార్య ప్రత్యేకత అన్నా హజారేకు కనిపించలేదు. త్రిపుర నుంచి వెలువడే డైలీ దేశర్ కథ సంపాదకుడు గౌతం దాస్ ఒక సందర్భంలో అప్పటి ముఖ్యమంత్రి నృపేన్ చక్రవర్తి, తానూ ఒక మామూలు రూమ్‌లో ఉంటామని చెప్పినప్పుడు చాలా ఆశ్చర్యం కలిగింది. నిజంగానే నృపేన్ పదవీ విరమణ సందర్భంలో ఒక్క సూట్‌కేస్‌తో బయటకు నడిచాడు! నిజాయితీపరుడైన శంకరన్ పిలిపించుకుని మరీ నియమించుకున్నాడు. రెండు దశాబ్దాలకు పైబడి బెంగాల్ ముఖ్యమంత్రిగా ఉన్న జ్యోతిబాసుపైన ఎలాటి ఆరోపణలూ లేవు. ప్రశ్నల కుంభకోణం స్టింగ్ ఆపరేషన్‌లో ఒక్కరంటే ఒక్క కమ్యూనిస్టు ఎంపి తమకు దొరకలేదని తెహల్కా ప్రకటించడం ప్రపంచమంతా చూసింది. కమ్యూనిస్టేతర ఇంకా చెప్పాలంటే రాజకీయేతర కార్పొరేటీకృత మార్గాల గురించే ఆలోచించే వారికి ఈ ప్రత్యేకతలు పొరబాటున కూడా కనిపించవు. సరళీకరణను ప్రశ్నించని ప్రత్యామ్నాయాలు మాత్రమే వారికి కావాలి. ప్రజల, ప్రజా సంఘాల, ప్రజా పక్షాల పాత్ర లేని పౌర సమాజ ఫార్ములాలే సర్వ శ్రేష్టమైనవి!

రాజకీయాలంటేనే చెడ్డవి అని శాపనార్థాలు పెట్టడం ద్వారా నిజమైన చెడ్డ రాజకీయాలను, పాలక వర్గాల దోపిడీ వ్యూహాలను రక్షించడమే జరుగుతుంది. రాజకీయేతర శక్తులకు పెద్ద పీట వేయడం

# మౌనం

చెళ్ళపిళ్ళ శ్యామల

పత్రాలపై కురిసిన
మంచు బిందువులు
మార్గశిర సౌందర్యాన్ని
మౌనంగా...
ఆస్వాదిస్తున్నాయి!
పెనవేసుకున్న
చెట్టు కొమ్మలు
ఆకుపచ్చని జ్ఞాపకాలను
నెమరు వేసుకుంటున్నాయి
పిల్లగాలికి
పూలన్నీ
పసిపాపల్లా
ఆడుకుంటున్నాయి
మట్టితో
విడదీయరాని సంబంధాన్ని
ముడివేసుకుంటున్నాయి
చెట్టు వేళ్ళు !



లక్ష్యం కోసం
సంకల్పబలంతో
యోగ ముద్రలో వున్న
మౌనిలా...
కనిపిస్తోంది చెట్టు !
రేయింబ వళ్ళూ
అలసట లేక
ఆకాశం కేసి చూస్తున్న
చెట్టు
వృద్ధాశ్రమంలో
వదిలి వెళ్ళిన
రక్త సంబంధం కోసం
వేయి కళ్ళతో ఎదురుచూసే
మాతృమూర్తి చూపులను
గుర్తు చేస్తోంది !
చెట్టుని చూస్తే...?
మాటలు రాని
హృదయ మేదో
మౌనంగా...
అనుభూతుల్ని
పంచుతున్నట్టనిపిస్తుంది
మౌనం
కనులు కానని
లోకాల్ని
చూడగలదు
మనసు పొరల్ని
స్పృశించనూ గలదు
మౌనం
ఎన్నో పాఠాలు నేర్పుతుంది
భాష కందని భావం
మౌనంలో...
తొంగి చూస్తుంది
మాటల కందని
చైతన్యం...
మౌనంలో
ప్రవహిస్తుంది
ఖచ్చితంగా
మౌనం
మాటకన్నా గొప్పదే!

---

ద్వారా పరోక్ష పద్ధతిలో మార్కెట్ శక్తుల ఆధిపత్యానికి మార్గం సుగమమవుతుంది. పౌర సమాజం అంటే అర్థం నానా రకాలైన ఎన్జీవోలు కాదు. ముసుగులు వేసుకున్న కార్పొరేట్ ప్రతినిధులు కాదు. నిన్నటి పారిశ్రామిక దిగ్గజం టాటా, నేటి అగ్రగాములలో ఒకరైన అనిల్ అంబానీ, వీటన్నిటినీ బయటపెట్టే మీడియా దళారీ నీరా రాడియా పార్లమెంటరీ కమిటీ ముందు వాంగ్మూలం ఇవ్వాల్సిన స్థితి దేన్ని సూచిస్తుంది? కనక అవినీతి నిర్మూలనను ఆర్థిక మూలాలతో సంబంధం లేని ఆదర్శంగా చూపించడం అవాస్తవికతే. ఎన్రాన్ కుంభకోణం నుంచి సబ్ ప్రైమ్ సంక్షోభం వరకూ అమెరికా, తదితర దేశాల్లో సాగిన అవినీతిని విస్మరించి వాటినే నమూనాలుగా చెప్పడమూ సరికాదు. రాజకీయ అవినీతిని అదేపనిగా దూషించే మార్కెట్ మార్పు అవినీతికి కూడా కళ్లెం వేయగలగాలి. విశృంఖల ప్రైవేటీకరణ, విచ్చలవిడి అవినీతి కవల పిల్లలనే పరమ సత్యాన్ని గుర్తించక పోవడం వల్లనే అన్నా వంటి వారి వ్యవహారం అంతిమంగా నీడతో యుద్ధ క్రీడగా మిగులుతుంది.

అయితే ప్రజలు, ప్రజా ఉద్యమాల పొడగిట్టని పాలకులు మూలాలను ముట్టుకోకుండా కాయకల్ప చికిత్సలతో సరిపెట్టే విన్యాసాలకు వారు ఇతోధిక ప్రచారం కలిగిస్తారు. అమితంగా స్పందిస్తారు. ఆయన అరెస్టు ప్రహసనం చాలా తప్పయినా అది కూడా ప్రచారం పెంచే దినుసులా మారింది. అయితే తమ అవసరార్థం ఆయనను ఆకాశానికెత్తిన కార్పొరేట్ మీడియా అది కాస్తా తీరగానే వెనక్కు నెట్టింది. ఆ ప్రచారం వల్ల వచ్చే ప్రజా స్పందనా తగ్గింది. అన్నా కార్యక్రమమే పరిమితమైనప్పుడు ఇలా జరగడంలో ఆశ్చర్యం లేదు. తాజా దీక్ష సందర్భంలో రాష్ట్రపతి ప్రణబ్‌పై ఆరోపణల జాబితా విడుదల చేస్తే రామ్‌దేవ్ బాబా వ్యతిరేకత తెలిపి వెళ్లారు. కాగా ఆయన నేరుగా గుజరాత్ వెళ్లి మోడీని కీర్తిస్తే అన్నా విభేదించారు. ఇవన్నీ ప్రహసనాలుగా మారాయి.

ఈ నేపథ్యంలో తామే రాజకీయ వేదిక ఏర్పాటు చేసి అధికారంతో అవినీతిని అరికడతామన్న మాట అతిశయోక్తిగా కనిపిస్తుంది. ఇప్పటికే రాజకీయ రంగస్థలంలో ఎన్డీఏ, యుపిఎ, వామపక్షాలు, ప్రాంతీయ పార్టీలు ఉండగా ఈ కొత్త వేదిక అదనంగా చేసేదేమిటన్నది ప్రశ్న ఒకటి. అవినీతి వ్యతిరేకత ఒక మంత్రి జపంలాగా చేస్తూ సరళీకరణ విధానాలు, మతతత్వం, సామ్రాజ్యవాదం, సామాజిక అణచివేత వంటి విషయాలు పట్టించుకోకపోతే ఫలితం ఏమిటన్న ప్రశ్న మరొకటి. రాజకీయాల్లోకి రావడం రాజ్యాంగ హక్కు అయినా ఈ ప్రశ్నలకు ఇచ్చే సమాధానాలు తీసుకునే ప్రాతిపదికలను బట్టి అన్నా రాజకీయ భవిష్యత్తు ఆధారపడి ఉంటుంది. లౌకిక ప్రజాస్వామిక విధానాలు, ప్రజానుకూల ఆర్థిక దృక్పథం, మతతత్వం పట్ల, కార్పొరేట్ ప్రాబల్యం పట్ల విమర్శనాత్మక వైఖరి ఏ మేరకు తీసుకుంటారనేది వేచి చూడాల్సిందే. కనుక అన్నా బృందం రాజకీయాల్లో ఏదో మార్పు సాధిస్తుందని చెప్పడానికి ఇప్పటికీ ఎలాంటి ఆధారాలూ లేవు సరికదా గతాన్ని బట్టి చూస్తే సందేహాలే కలుగుతాయి. ♦

## కథ

# ఎరువుల దుకాణంలో పుస్తక పఠనం



మలయాళ మూలం : **వైశాఖన్**
తెలుగు సేత : **ఎల్.ఆర్.స్వామి**

**కథ చదువుతూ కూర్చునే అతనికి మూడోసారి కూడా ఆటంకం కలిగింది. విరాళం కోసం కొందరు దుకాణంలో అడుగు పెట్టారు. వాన వెలసిపోవటం గురించి ఆగినట్లున్నారు వాళ్ళు. రసాయన ఎరువుల గురించి ప్రతిపాదించే ఒక చిన్న కరపత్రం తీసి పుస్తకంలో గుర్తు పెట్టి పుస్తకం మడిచాడు.**

వాళ్ళు ఇచ్చిన కరపత్రం అందుకున్నాడు. కొండవారగా వుండే అమ్మవారి విగ్రహం గాలికీ వానకీ తల్లడిల్లాడి పోతోందట ! గుడి చాలా జీర్ణావస్తలో ఉందట ! క్షేత్రపునర్నిర్మాణం కోసం కంకణం కట్టుకున్న వారు వాళ్ళు. వాళ్ళలో కొందరు ఎరువుల కోసం దుకాణానికి వస్తూ వుంటారు. అందువల్ల ఒక పదిరూపాయలు తీసి ఇచ్చాడు అతడు. రసీదు వ్రాసేవాడి ముఖం వెలగలేదు అదోలా చూశాడు.

"అలా చూసి ప్రయోజనమేమి లేదు" అతడు అన్నాడు "నావంతు ఇంతే"

"రెండు లక్షలు అంచనా.. తెలుసా..?

"కావచ్చు నేను ఇంతకన్నా ఇవ్వలేను. ఎక్కువ ఇవ్వగలిగేవారెందరో ఉన్నారుగా, ఇక్కడ"

ఆ తరువాత ఎవ్వరూ మాట్లాడలేదు. రసీదు బల్లమీద పెట్టి వెళ్ళిపోయారు. పుస్తకం మళ్ళీ విప్పకుండా తడిసిన రోడ్డు మీద వెళ్ళే వారిని చూస్తూ నిలబడ్డాడు అతడు.

అతడు ఎరువుల దుకాణం ప్రారంభించినప్పుడు అక్కడ ఒక సారా దుకాణం మాత్రమే ఉండేది. రెండు బస్సులు మాత్రం కొండ క్రింద దాకా వెళ్ళేవి "పట్నానికి స్వాగతం "పలికే బోర్డు నుండి కనీసం మూడు కిలోమీటర్లైనా వుంటుంది అక్కడికి. కాని రోడ్డు కూడలి కావటం వల్ల కావచ్చు పరమేశ్వరన్ నాయర్ ఒకటే షాపు ప్రారంభించాడు. అక్కడ కూలీలు కొంతదూరంలో వున్న పారిశ్రామికవాడలో పనిచేసే కార్మికులు బస్సు కోసం అక్కడే నిలబడతారు.

"అయ్యప్ప టీ షాపు" అనే బోర్డులతో సహా అతనికి ఆ షాపు అప్పగించాడు పరమేశ్వరన్ నాయర్. పాపం ! బాగా నష్టపోయాడట ! అప్పు ఇవ్వడమే తప్ప తిరిగి వసూలు చేయలేక పోవటం అనేది అతని జబ్బు, చరిత్రలో చిరుదానంతర బిరుదు పొందిన పిదప ఏం చేయాలని తోచక తిరిగే అతడు తను ఒక ఎరువుల దుకాణం ప్రారంభిస్తాడని కలలో కూడా అనుకోలేదు. ఉద్యోగం కోసం వెతికాడు కొంతకాలం. చుట్టూ దర్శనమిచ్చే అసమానత్వాల పట్ల అన్యాయాలపట్ల అసహ్యం పెరిగింది. గౌరవనీయులు ముసుగు ధరించి తిరిగే అధములు అందించే అందమైన వాగ్దానాలు ఆ వాగ్దానాల మెరుపుకి కళ్ళు బైర్లు కమ్మి ఆనందంగా తూలుతూ, అదృశ్య గోడలు గల కారాగారాలకు అడుగులు వేసే సగటు మానవులు అంతా తెలిసి గుండెకి నిప్పు అంటుకున్న కాలం ప్రయోజనకరమైన దేదైనా చేయగలడా, అనేదే అతని ఆలోచన అయినా ఏమి చేయలేకపోయాడు, ఎందువల్లనో కాని తెలియదని నటించినది ఇప్పుడు అర్ధమవుతోంది. అతడు ఒక బలహీనుడు ! అంతకన్నా పిరికి ! ఆ పిరికితనం నుండి విముక్తి కలిగించడానికి కాబోలు, అతని తండ్రి కుటుంబ బాధ్యతయంతా అప్పగించి చిధిలో కాలి కుదించుకుపోయాడు అయ్యప్ప టీ షాపువాడు, నష్టంలో కూరుకుపోయిన షాపు అప్పగించడానికి కూడా కారణం అదేనేమో! ఏది ఏమైనా తండ్రి మిగిల్చిన పొలం సాగు చేయడానికీ. కొన్ని రబ్బరు మొక్కలు నాటడానికీ ఎరువుల దుకాణం మొదలు పెట్టడానికీ అదే కారణమైంది. ఎరువులమ్మే వారి సమావేశంలో ఎరువుల కంపెనీ జి.యం గారు చెప్పిన మాటలతో అతడు తను చేసినది

సమర్థించుకున్నాడు. "ఎరువులు అమ్మడమనేది కేవలం ఒక వ్యాపారం కాదు, అది గొప్ప రైతు సేవ" అనేవి ఆ మాటలు.

రైతు సేవ చేయడం ప్రారంభించి ఎనిమిదేళ్ళు గడిచాయి. ఈ ఎనిమిదేళ్ళలో ఊరు చుట్టూ పరిసరాలు ఎంతో మారిపోయాయి. కూడలికి దిగువన టారు వేసిన రోడ్డు మీద వుంది అతని దుకాణం అక్కడ కూర్చుంటే కొండ దాకా కనబడుతుంది. రెండు కిలోమీటర్ల దూరమది. మలుపులు లేని రోడ్డుకి ఇరువైపుల పొలాలుండేవి. దున్నటంగా, నారు నాటడంగా కోత కోయడంగా కాలం పలుభావాలతో దర్శనమిచ్చేది. దుకాణంలో కూర్చునే అతడు కూలీలపాటైనాడు. కరిమబ్బులు కమ్మిన ఆకాశమైనాడు.

మారిన పరిస్థితి అతని నుదుటి మీద "పరాయివాడు" అనే మాట వ్రాసింది. ఒకప్పుడు రోడ్డుకి ఇరువైపుల కొండ దాకా కనబడిన పొలాలు ఇప్పుడు లేవు. కొందరు పొలాల్లో కొబ్బరి మొక్కలు నాటారు. మరికొందరు సేద్యం చేయకుండా వదిలేశారు.

రియల్ ఎస్టేటువారి కారలు రైతు నెత్తురుతాగే విచిత్రజీవుల్లా రోడ్డు వారగా చాలాసేపు ఆగాయి. పొలాల గుండెల్లో మేక లాంటి కొయ్యలు బిగించారు. కొత్త రోడ్డులు పోశారు. సిమెంటూ ఇసుకల లారీలు పరుగెత్తుకొచ్చాయి. ఎన్నో 'నగర్లు' లేచాయి "అంటేనాల అస్తి పంజరాలు బలికాకులు విలపించాయి. ఆ మార్పు కొండ దాకా వ్యాపించింది. రెండు మసీదులూ మూడు చర్చిలు వెలిసాయి మసీదు నుండి నమాజుకు పిలుపు 'అల్లాహె' చర్చి నుండి గంటారావం వాన నీళ్ళలా జారింది. అప్పుడు విగ్రహాలు తడుస్తున్నాయని మేలుకునేవారికి ఆధ్యాత్మిక భద్రతా రాహిత్యం అనిపించింది. వాళ్ళు కూడా కాన్క్రీటు కోటల కోసం ప్రయత్నం చేయనారంభించారు. ఎవ్వరెవ్వరో ఏమిటేమిటో వెతకడం కోసం తాపత్రాయపడుతున్నారు. ఎవ్వరెవ్వరో ఏదేదో ఆక్రమించడానికి సిద్ధమవుతున్నారా ?



మళ్ళీ పుస్తకం తెరిచాడు అతడు. విశ్వ విఖ్యాత రచయిత మొక్కమోమిషిమ గారి కథా సంపుటం అది. అందులోని 'అస్తమయం కడలి" అనే కథ చదువుతున్నాడు అతడు. ఇక ఒక పేజీ మిగిలివుంది. మళ్ళీ చదవటం మొదలు పెట్టినప్పుడు తెలిసింది ఆక్రమణ గురించీ భద్రత గురించీ ఎందుకు ఆలోచించాడని. ఆ కథలో ప్రస్తావించబడిన పిల్లల పవిత్ర యుద్ధం 'మనసుకు బాధ కలిగించింది. జపాన్‌లో కడలికి దగ్గరగా వుండే కొండ వార ప్రాంతంలోని ఒక బౌద్ధ విహారంలోని ముసలి పూజారి ఆ కథలోని ప్రధాన కథా పాత్ర. వాతావరణం బాగుండే సాయంత్రం కొండ పైకి నడిచి వెళ్తాడు అతడు. అతనికి వున్న ఒకే ఒక స్నేహితుడు మూగవాడు బధిరుడు కూడా. కొండపైన నిలబడి సూర్యాస్తమయం చూస్తూ నిలబడటం అతనికి సంతోషానిచ్చేది. సంధ్యాగమనాన్ని సూచించే పక్షుల పాట ఆకాశంలోని గడ్డకట్టిన సూర్యుడు ఇంకా సముద్రంలోకి దిగలేదు కొంతదూరంలో కుప్పగా పడివున్న మబ్బులకు నిప్పు అంటుకున్నాక పొగ పొరలు లేచివిడిపోవటం చూస్తూ అతడు తన ఆత్మకథ చెబుతాడు. జపానీ భాషను బాగా మాట్లాడగలిగినా ఫ్రెంచి భాషలోనే కథ చెబుతాడు అతడు. అయిదో పవిత్ర 'యుద్ధం' తరువాత పవిత్ర భూమియైన జెరుసెలం శత్రువులు స్వాధీనం చేసుకున్నారు. ఊరంతా దుఃఖంలో మునిగింది. కొండ వార ప్రాంతంలో ఒంటరిగా గొర్రెలను మేపే హెంద్రి అనే పిల్లవాడు ముందు ప్రత్యక్షమైనాడు యేసు ప్రభువు అతని శిరసు మీద చేయవేసి అన్నాడు "ఒక పవిత్ర భూమిని తిరిగి సంపాదించవలసిన పనినీదే. వీలున్నంత ఎక్కువ పిల్లలను నీతో చేర్చుకుని జెరుసెలాన్ని తిరిగి సంపాదించు. మార్సివెసులోకి వెళ్లండి మీరు పవిత్ర భూమిలో మీదుపాదం మోపడానికి వీలుగా అక్కడ సముద్రం రెండుగా చీలుతుంది మీకు దారి ఇస్తుంది."

యూనిఫోం వేసుకున్న బడిపిల్లల గుంపు దుకాణాన్ని దాటి వెళ్ళింది. హఠాత్తుగా ఒక గ్రూపు డ్రెల్లు లో అన్నట్లు ఎన్నో గొడుగులు ఒకేసారి విచ్చుకున్నాయి. వాన మొదలైనట్లుంది పుస్తకం మడిచి బల్ల మీద వుంచి ఆ కథ గురించే ఆలోచించాడు అతడు.

వేల వేల పిల్లలతో మార్చి లెనిలోకి బయలుదేరాడు హెంద్రి. ఆకలి వల్లనూ జబ్బువల్లనూ దారిలోనే ఎందరో పిల్లలు నేలకి ఒరిగారు అయినా, హెంద్రి ముందుకు సాగాడు. సినిమాల్లో చూసి, చూసి అలవాటైన యేసురూపం అతని మనసులో జ్వలించింది. సముద్రం రెండుగా చీలిదారి ఇస్తుందనే మాటలు చెవుల్లో గింగురుమన్నాయి.

చివరికి, మార్చిలెసు చేరుకున్నారు వాళ్ళు ఆటుపోటులతో కదిలే సముద్రాన్ని చూస్తూ ఆశగా నిలబడ్డారు. చాలాసేపు అలా నిలబడ్డాక, పిల్లల మధ్య నుండి బయటికి వచ్చి ఓడరేవు వైపు నడిచాడు హెంద్రి. ఓడల్లో కూర్చున్న వారు పిల్లలను కుతూహలంతో చూస్తూ నవ్వుకున్నారు. వార్ఫ్‌కు దగ్గరగా వెళ్ళి కడలి వైపు తిరిగి చాలాసేపు ప్రార్థించాడు సాయంకాల సూర్యుని వెలుగులో సముద్రం మెరిసింది. అలలు ఎగిరివచ్చి వార్పును 'ఢీ' కొట్టి చెదిరిపోయాయి.

సముద్రం రెండుగా చీల లేదు మంచివాడిలా కనబడిన ఒక వ్యక్తి వాళ్ళను సమీపించాడు. వాళ్ళకు భోజనం పెట్టాడు ఓడలో పవిత్ర భూమికి పంపుతానని వాగ్దానం చేశాడు. కొందరు పిల్లలు ఒప్పుకోలేదు. వాళ్ళు వెనక్కు తిరిగారు. కొందరు హెంద్రీ తో ఓడ ఎక్కారు. ఓడ పవిత్ర భూమి వైపు వెళ్ళలేదు. ఈజిప్టులోని అలెక్సాండ్రియా చేరుకుంది. పిల్లలు బానిసలుగా సంతలో అమ్మబడ్డారు. పలుసార్లు అమ్మబడి చివరికి హెంద్రి ఇండియా చేరుకున్నాడు. ఒక బౌద్ధ భిక్షు అతన్ని రక్షించాడు. తన జన్మభూమికి వెళ్ళి వుండవచ్చు హెంద్రి కాని, తనకు విముక్తి ప్రసాధించిన అతని శిష్యునిగా జపాన్ వెళ్ళడానికి ఇష్టపడ్డాడు. కమకు రా లో అతడు నెలకొల్పిన దేవాలయంలో ఆన్‌రే అనే పేరుతో సంవత్సరాలు గడిపాడు.

ఇప్పుడు వయసు మీద పడి అతనికి భ్రమ కలిగించే ఆలోచనలు

లేవు. పవిత్ర భూమి గురించిన కలలూ లేవు. బౌద్ధ గురుమాటలు మనసులో జీర్ణించుకున్నాడు. అయినా అస్తమయ సూర్యుని చూస్తూ నిలబడినప్పుడు సముద్రం లోతుకు దిగేటప్పుడు రక్త ప్రళయంలా అలలు కదిలేటప్పుడు అప్పుడు తనుమేపిన గొర్రెలమంత నమ్మకంతో తనతోవచ్చిన పిల్లలు అంతా గగన సీమలో కనబడి దర్శనమిచ్చి అదృశ్యమవుతున్నట్లు........

"పురుగుల మందుందా?" ఎర్రకడలిపై చీకటి పడే ఆకాశం నుండి ఒక ఆడగొంతు ఉలిక్కిపడ్డాడు అతడు. ఎదురుగా తడి గాలిలో ఎగిరే జుట్టుతో ఒకామె... "పురుగుల మందుందా? మళ్ళీ అడిగింది ఆమె. అతనిలో వ్యాపారి నిమిషంలో మేల్కొన్నాడు. రెండు సీసాలు పురుగుల మందు ఉన్నాయనేది గుర్తువచ్చింది. "ఎక్స్‌పైరీ" తేదీ దగ్గరపడ్డ రెండు సీసాలు

"చిన్న సీసా లేదు".

"పర్వాలేదు, ఇవ్వండి"

"ఎనభైరూపాయలు.."

ఆమె మొలలోని సంచి తీసింది. డబ్బు లెక్క చూసింది. అప్పుడు చూశాడు అతడు ఆమెను. యవ్వనం వీడ్కోలు చెప్పని శరీరం రంగు వెలసిన చీర జాకెటు..



ఈమె..

హఠాత్తుగా తలయెత్తింది ఆమె. అతని కళ్ళలో సూటిగా చూడలేక ఒక నేరస్తురాలలా చెప్పింది. "ఇప్పుడే వస్తాను, డబ్బు సరిపోదు. గబగబా నడిచి వెళ్ళిపోయింది ఆమె. పొలాన్ని పండించకుండా వదిలేసిన వాళ్ళలో ఒకత్తి కాదు 'ఆమె అని అనుకున్నాడు అతడు. కాని ఇంతక్రితం చూసిన గుర్తులేరు. ఎరువుల కోసం వచ్చిన ప్రతి ఒక్కరిని ఎక్కడ చూసినా పోల్చగలడు అతడు. బహుశా ఎరువుల కోసం ఆమె భర్త వస్తూవుండాడేమో. .

ఆమె కనుమరుగవగానే అస్తమయకాల సముద్రాన్ని బాధగా చూస్తూ నిలబడే ముసలివాడు గుర్తుకొచ్చాడు. దేవుని మాటలు పూర్తిగా నమ్మి ప్రార్థించినా రెండుగా చీలని అదే సముద్రం...

అతనిలోని చరిత్ర విద్యార్థి మేలుకున్నాడు. పవిత్ర యుద్ధాల గురించి చదివిన రోజుల్లోనే పిల్లల పవిత్ర యుద్ధం అతనికి బాధ కలిగించింది. మిగతా ఎనిమిది పవిత్ర యుద్ధాల్లో ఎందరో పాల్గొన్నారు. యుద్ధానికి వెళ్ళిన అందరికి ఒకే ఉద్దేశ్యం ఉండేది కాదు. పవిత్ర భూమిని తిరిగి సంపాదించటం కాదు ముఖ్య ఉద్దేశ్యం మరీ కొంత కీర్తి సంపదా ఆశించి యుద్ధంలోకి దిగారు. ప్రభువులు. వ్యాపారులు, ఓడలూ ఆ యుద్ధాలు అమ్మి డబ్బు చేసుకోవచ్చునని అనుకున్నారు. పేదవాళ్ళు అప్పుల నుండి విముక్తి పొందటం కోసం యుద్ధంలో పాల్గొన్నారు. నేరస్తులు కారాగార శిక్ష నుండి విముక్తి పొందటం కోసం యుద్ధం చేశారు. పవిత్ర యుద్ధాలు పరాజయకారణాలిలా ఎన్నెన్నో ! కాని పాపం పిల్లలు ! వాళ్ళెందుకు బలిపశువు లైనారు ? కాపట్య రాహిత్యం వల్ల యుద్ధం గెలవచ్చునని వాళ్ళు ఆశించారా? పిల్లలకు భ్రమ కలిగించిన ఆలోచనలు బహుకరించిన పెద్దలు చరిత్రలో దాగివున్నారు. పవిత్ర భూమి నేడు చూపులకు అందని దూరంలో...

దుకాణాం ముందు ఒక "టెంపో" వచ్చి ఆగింది. షావుకారు ఏ.కె.టెంపో నుండి దిగాడు "గ్లాక్సో" పంచ, లాల్చీ ధరించి వున్నాడు. ముఖం మీద వెలుగు – "ఏరా, నిద్రపోతున్నావా?" పాకెటు నుండి కొన్ని నలిగిపోయిన కాగితాలు తీసి ఇస్తూ అడిగాడు షావుకారు" ఇదిగో .. ఇవన్ని సరిగా చూడు. లెక్క తేడా రాకూడదు. బస్తాలు 'టెంపో'లో ఎక్కించు వెంటనే. నువ్వేమి కష్టపడనక్కరలేదు. పని అంతా వీళ్ళు చేస్తారు."

టెంపోలో నుండి దిగే కూలీలను చూస్తూ అన్నాడు షావుకారు. అతడు బుర్ర ఊపాడు.

"అయితే నేను బయలుదేరుతా" షావుకారు మళ్ళీ అన్నాడు. కారు షెడ్డులో వుంది తీసుకోవాలి."

కాగితాల మీదకి దృష్టి మళ్ళించాడు "పాతిక కే.జీలు ఎన్.పి.కె ఇవ్వండి, ఎస్.సి.పి స్కీములో"

పేరులన్ని రైతులవే ! డబ్బు సర్కారు నుండి తీసుకోవచ్చు. క్రిందటి ఏడాది కూడా వీళ్ళంతా స్వయంగా వచ్చి ఎరువులు కొనేవారని గుర్తు వచ్చింది అతనికి. వాళ్ళు శ్రమపడిపని చేసి ఇబ్బందుల పాతాళలోకం నుండి బయటపడుతున్నారు కదా అని అప్పుడు కొంత ఆనందం కూడా కలిగింది. ఇప్పుడు కొత్త విషయాలు తెలుస్తున్నాయి. వీళ్ళకు ఫ్రీగా అందిన కొబ్బరి మొక్కలు ఎదిగేది వేరెవ్వరితోట లోనో ! అందగానే అమ్మేశారు వాళ్ళు. ఇప్పుడు తెలివి పెరిగింది కాగితాలు ఆఫీసులోనే షావుకారుకు అందచేసి డబ్బు తీసుకుంటున్నారు.

సమస్య ఎక్కడ వుంది? గోడ మీద అంటించిన పోస్టరు వైపు వెళ్ళింది చూపు. ఆ పోస్టరులో తలపాగా కట్టుకున్న ఒకడు నవ్వుతూ కనబడ్డాడు ఎక్కువ దిగుబడి రేపటి సమృద్ధి కళ్ళు వెనక్కు లాగాడు కాని అవి "మిషిమ, ముఖం మీదకు వెళ్ళాయి. రచయిత జీవితానికి వీడ్కోలు పలికినది అనుష్ఠాన పరమైన ఆత్మహత్య ద్వారా కదా అనేది గుర్తుకు వచ్చింది. స్వయం పొట్టచీల్చుకుని చేసిన ఆత్మహత్య –!

డబ్బు చాలదని వెళ్ళిన స్త్రీ తిరిగి వచ్చింది. ఎనభై రూపాయలు బల్లమీద పెట్టింది. పురుగుని చంపే విషాన్ని కూడా ఈమె మందు అని సంబోధించటం విని ఆశ్చర్యం కలిగింది.

పురుగుల మందు సీసా తీసి బల్లమీద పెట్టాడు. కొంగు భుజం మీదుగా వేసుకుని ఆకాశం వైపు చూసింది ఆమె. ఆ తరువాత సీసా అందుకొని గబగబా నడిచి వెళ్ళింది.

చీకటి కమ్మే ఆకాశం వైపు నడిచి ఆమె అదృశ్యమవగానే అతని గుండెలో ఒక ఉరుము ఉరిమింది.

ఆమె ముఖం మీద వెలుగు అస్తమయ సూర్యునిదా? ♦

# అస్తమించని సూర్యుడు

మేధవరం కాంతికుమార్
9948125268



పరవళ్ళు తొక్కుతున్న కొల్లేరు ఒడిలో
మాలపల్లి పురిటినొప్పులు పడి
ఉద్యమ నెలబాలుడ్ని ఊపిరినూదింది
దురాక్రమించబడ్డ జీవితంలోకి
స్వేఛ్ఛాగీతం గానం చేసినట్టు
ఊరి భూస్వామి గుండెల్లో
ఊయలై ఊగే సూరీడు కళ్లు తెరిచాడు
దుఃఖభరిత జీవితంలో ధిక్కారపు స్వరమై
అతని కవితాగానం ఏరులై పారింది
శతాబ్దాల నుండి వీస్తున్న కులదురహంకార
ప్రస్థానంలో పొలికేకై నిలిచిన నిరంతర సంచలనం
కుప్పకూలిన చుందూరు శవాల మధ్య
తనను తనే ధిక్కరించుకున్న వర్తమాన అస్పృస్యత
చేతుల్లో నిప్పులు కక్కుతున్న తుపాకీ,
కాళ్లీడ్చుకుంటూ కిలోమీటర్ల కొద్దీ
మోసుకు తిరిగిన మందుపాతర సమాధానం లేక బిక్కచచ్చాయి
అస్తమించిన ప్రశ్నలే మళ్ళీ మళ్ళీ ఉదయిస్తున్నాయి
గమ్యం చూపిన దారులే అగమ్యమౌతున్నాయి

ఉడుకుతున్న కుంపట్లో నిప్పుకణిక
నా ఎరుపెక్కదని ప్రశ్నిస్తోంది
తెగిపడిన మొండెం సేదతీరే క్షణం కోసం
కాసింత చోటివ్వమంటోంది
చెమట చుక్కలు ధ్వంసమయ్యి ఆకలి మింగేసిన
ఆశ చావని జీవాలు లాంగ్ మార్చ్ చేస్తున్నాయి
నల్లటి సూరీడు ఎర్రటి ఎండకోసం నాలుక చాస్తున్నాడు
అణచివేయబడ్డ స్వరాలు ఆధిపత్యం కోసం మెడలో చావుని
వేలాడదీసుకుని పాదం తొణక్కుండా తప్పటడుగు
వేస్తున్నాయి
తిరిగి స్వేచ్ఛలోకి యింకిపోదామంటే వేల స్వరాలు
నిశ్శబ్దగీతాన్ని
బృందగానం చేస్తున్నాయి
పయనించే దారులు వందలకొద్దీ దృశ్యమానం
అవుతున్నాయి
అలుపెరగని ప్రయాణం హామి ఇవ్వబడింది
రేపటి సమానత్వం కోసం ఆకాశం నేలకు ఒరిగి మాలపల్లి
నడిబొడ్డున
ఎర్రటి నీలినక్షత్రాన్ని నాటెల్లింది

# విచ్ఛిన్న స్వప్నం

ఈతకోట సుబ్బారావు
9440529785



పిడికెడు మట్టిని తాకితే
కోట్లాది ఆత్మల స్పర్శ
విద్యుల్లేఖలా వొళ్లంతా అల్లుకొనే
హరిత శ్వాసల పరిమళం
సర్వం గతజల సేతు బంధనమై
మరోగతం కళ్లలో
వొత్తు లేసుకొని కలగా వెలుగుతుంది
కూలిపోయిన కోట గోడలు
శిథిలాలపై పాకుడు ధూళి పొర
తరతరాల పురాతన శ్వాసని
గుర్తుచేస్తూ వీచే పిల్లగాలి
గత వైభవ చిహ్నాలన్నింటినీ
తుడుచి వేసిన కాలం అడుగులు
రాతి గుట్టలే తప్ప
కనిపించని సమాధుల జాడలు
రాజరికపు దర్పమంతా
కొరికి తినేసిన గబ్బిలాలతండా
కాళ్లు చేతులు విరిగిపోయిన

నర్తకీ మణుల కుంఠిత శిల్పాలు
రత్నాల రాసులు పోసి అమ్మిన చోటే
పేరుకుపోయిన రాళ్ల గుట్టలు
ఎటుచూస్తే అటొక విషాదం
వుబికిన కన్నీళ్ల తడి పీల్చిన నేల
కాలపు కరకు కసాయి తనమంతా
ఈ శిథిలాల్లో స్థిరపడిపోయింది
రాజుల్ని, రాజ్యాల్ని ప్రజల్ని కబళించిన
వొకనశ్వర తుఫాను వీచిన గుర్తులు
ఎన్ని గుండెల్లో కలలు బతికాయో
ఎన్నికళ్లల్లో గుండెలు వేచాయో
స్వప్న శకలాలై పడివున్న అంతఃపురాలు
ఆర్తనాదాల ఛాయల్ని మోసుకొచ్చే
ఉద్విగ్న వాయులీన తరంగాలు
వొకప్పుడు జీవనది చల్లిన కలయంపి
కోట యిప్పుడొక విచ్ఛిన్న స్వప్నం !

# మిని కవితలు

మల్లవరపు విజయ

తప్పు చెయ్యటం
తప్పు కాదు !
'కాని' చేసిన తప్పును
'దిద్దుకోక పోవడమే'
తప్పు !

ఎలక్షన్ బూతులో
ఓట్లు కాదు పడేది !
నిరుపేదల
ఆశల ముద్రలే !

కర్పూరం వెలుగుతూ
కరిగి పోతుంది !
కాని !
ఈ 'మనిషే'
ఎంతకూ కరగడు



అదిమినా ఆగదు
సంతోషం !
మనస్సు
జ్ఞాపకాల అర !

# కొత్త పుస్తకాలు




**మరణకాంక్ష**
సలీం
వెల : రూ.150/- పేజీలు : 240
**ప్రతులకు : 040-27678430**

దీని గురించి చర్చ వచ్చినపుడల్లా సంక్షుభిత సముద్రంలో పయనిస్తున్న పడవలా ఉంటుంది మా పరిస్థితి' అని సుప్రీం కోర్టు జడ్జిచే వ్యాఖ్యానించబడిన సంక్లిష్ట అంశాన్ని వివిధ కోణాల్లో చర్చించిన నవల "మరణ కాంక్ష".

- పబ్లిషర్




**కార్మికగీతం**
అక్కినేని కుటుంబరావు
వెల : రూ.150/- పేజీలు : 285
**ప్రతులకు : 040-27612474**

రచయిత ఎన్నో సంవత్సరాల అధ్యయనం- కంపెనీల్ని కార్మికుల్ని, వారి పేదరికాన్ని, పేదరికం వల్ల వచ్చిన బేలతనాన్ని, యాజమాన్యాల దాష్టీకాన్ని, సంఘటిత మయ్యేందుకు కార్మికులు చేసే ప్రయత్నాల్ని, వాటిని భగ్నం చేసేందుకు యాజమాన్యాల కుట్రలను ఈ నవల్లో అత్యంత ప్రతిభావంతంగా మలిచారు.

- ఆర్. సుధాభాస్కర్




**చే**
విశ్వేశ్వరరావు
వెల : రూ.50/- పేజీలు : 112
**ప్రతులకు : 9490634849**

దీన్లో రచనలు కలగలవుగా కనిపిస్తాయ్. స్థూలంగా జీవిత రేఖలు, చే ప్రసంగ వ్యాసాలు ఒక ఎత్తు. చే ను గురించి తెలుగు కవి / రచయితల స్మరణం మరొక ఎత్తు. చే ఫోటో రచనల కూర్పు మరొక ఎత్తు.

సాహితీ మిత్రులు




**మనసు మాట**
(కవితాసంపుటి)
శ్రీమతి బషీరున్నీసా బేగం
వెల : రూ. 100 పేజీలు : 132
**ప్రతులకు : 9985193997O**

ఒక జీవన విధానం లోంచి నిర్మలమైన దృష్టితో తాను చూచే అన్ని జీవితాంశాల్ని ప్రతిఫలిస్తూ కవితలు, రాసిన వారిలో ఒకరు బషీరున్నీసా బేగం. ఆమె, తాను చూస్తున్న, అనుభవిస్తున్న జీవితంలోంచీ లోకాన్ని చూస్తున్న విధానం, "మనసుమాట" అనే ఈ కవితా సంపుటిలో అక్షరీకరిస్తున్నారు. ఈ కవితల్లో స్వచ్ఛమైన నిజాయితీతో కూడిన ఆలోచనలు పాఠకుల్ని ఆకర్షిస్తే ...

డా॥ అద్దేపల్లి రామమోహన్‌రావు




**నిరీక్షణే ఒక గాయం**
కవిత్వం
ఎన్. అరుణ
వెల : రూ.75/- పేజీలు : 80
**ప్రతులకు : 040 - 27037585**

"ఎందుకో ఈ మధ్య మట్టి నాతో మాట్లాడటం లేదు మొక్కలు మొలవని సిమెంటు ఎడారిలో చిక్కుకపోయానని కాబోలు"

ఎన్. అరుణ




**అడ్డా**
శైలజామిత్ర
వెల : రూ.80/- పేజీలు : 160
**ప్రతులకు : 040 - 27678430**

శైలజామిత్రగారికి స్టోరీకి, షార్ట్ స్టోరికి మధ్య ఉన్న భేదం తెలుసు. కథకు, కథానికకు మధ్య ఉన్న భేదం తెలుసు. అందుకే చిన్న కథలు, మంచి ఆలోచనలను రేపే కథానికలు రాయగలుగుతున్నారు.

- వేదగిరి రాంబాబు

# కొత్త పుస్తకాలు




## స్పాట్ సిగ్నేచర్స్

డా॥ నాళేశ్వరం శంకరం

వెల : రూ. పేజీలు : 52

ప్రతులకు : 040 - 24542019

స్పాట్ వాల్యూషన్ సెంటర్ నుండి వస్తున్న ఐదవ కవితా సంకలనమిది. ఒకప్పుడు పేపర్లు దిద్ది దిద్ది, క్యాంపస్ క్యాంటీన్ తేనీరును చప్పరిస్తూ ఓ ఇద్దరు ముగ్గురు కవులు ఒకరి కవితను ఒక్కరు వినిపించుకునేవారు. ఇప్పుడు ఇంతమంది అధ్యాపక కవులు, కవయిత్రులు కవిత్వం రాయడం ఒక విశేషణం.

**- డా. నాళేశ్వరం శంకరం**

## విభిన్న భూమికలు (పొంటమ్ కవిత్వం)

బొల్లిముంత వెంకటరమణారావు

వెల : రూ.65/- పేజీలు : 72

ప్రతులకు : 8106713351




ఈ 'విభిన్న భూమికలు' కవితా సంకలనం బొల్లిముంత రమణారావ్ వినూత్న ప్రక్రియల సమాహారం..

... ...

తెలుగుదనం నిండిన భాష, సంక్లిష్టతలేని భావజాలం, ఆలోచనలో పరిపూర్ణతను దర్శింపచేసే ప్రకృతి కాన్వాస్ చిత్రాలు ఈ కవితలలోని భావశకలాలు.

**- డా॥ నోరి రాజేశ్వరరావు**



## సమ్మోహనం

కోటం చంద్రశేఖర్

వెల : రూ. 50 పేజీలు : 173

ప్రతులకు : 9492043348

శేఖర్ కవితలో ఉన్న పరిస్థితులపట్ల బాధ పడటం వుంది. బాధితులపట్ల ప్రేమవుంది. బాధలు పెట్టేవాళ్ళపై కోపం వుంది - ప్రజల సమస్యల పరిష్కారాల భూమికగా మారాల్సిన అసెంబ్లీలు ఆయా పార్టీలకు శయనమందిరాలుగా మారటాన్ని కవి గుర్తిస్తాడు. బధిరాంధకరాజకీయ మరుగుజ్జులను పీడింపబడే జన సందోహం సునాములై పోటెత్తే దశ ఎంతో దూరంలో లేదని హెచ్చరిస్తాడు.

**హిమజ్వాల**




## శిశిర చిత్రాలు

వడలి రాధాకృష్ణ

వెల : రూ. 100 పేజీలు : 84

ప్రతులకు : 9985336444

అరవై రెండు కవితలున్న ఈ కవితా సంపుటి గత పదిహేనేళ్ళుగా వస్తున్న మార్పుల్ని, వాటి ప్రభావాల్ని అటు జీవితం మీద యిటు సాంస్కృతిక సంపద మీద మానవ సంబంధాల మీద తద్వారా ఏర్పడుతున్న బాహిరాంతర సంక్షోభాల్ని, క్లేశాల్ని రూపు గట్టడానికి ప్రయత్నం చేసింది. కవి అన్ని సంక్లిష్ట సన్నివేశాలకి మెలకువగా వుండి, తనదయిన పద్ధతిలో సంస్పందించి రికార్డు చేశారు.

**- కె. శివారెడ్డి**

## నిప్పు కణికలు

కవితా సంపుటి

మొగిలి స్వామిరాజ్

వెల : రూ. 65 పేజీలు : 77

ప్రతులకు : 9963642205




నిప్పుకణికలు 53 కవితలున్న వచన కవితా సంపుటి. దీనిలో పుష్కలమైన సామాజిక స్పృహ, సామాన్య పౌరుడిలోని ఆగ్రహం వుంది. అవినీతిపైన యుద్ధ ప్రకటన వుంది. దుఃఖితులపట్ల అపారమైన ప్రేమ ఉంది. తను ఎంచుకొన్న వస్తువు పట్ల నిబద్ధత వుంది. దానికి తగిన పదాల కూర్పువుంది. పరస్పర భావ వినిమయానికి ఇంతకన్నా ఏం కావాలి? ఈ విషయంలో స్వామిరాజ్ కృత కృత్యుడయ్యాడనే చెప్పాలి.

**- సూరారం శంకర్**




## ప్రజా ప్రస్థానం

హాజీ ఎం.ఏ. గఫార్

వెల : రూ. 30 పేజీలు : 48

ప్రతులకు : 9490324834

గఫార్ సరికొత్త కవితా సంపుటి 'ప్రజాప్రస్థానం'తో ముందుకు వస్తున్నారు. ప్రపంచాన్ని చూచేవాడు ద్రష్ట. తాను చూచిన ప్రపంచాన్ని రసహృదయంతో అక్షరీకరించేవాడు స్రష్ట. లోకాన్ని చూడని కవిత్వం లోకానికి చేరువ కాదు. అందుకే శ్రీశ్రీ సమాజాన్ని చూడలేని కవిత నిజం చూపదు అన్నారు. గఫార్ సమాజాన్ని చూచి స్పందించి రచించినది కొత్త కవితా సంపుటి.

**డా॥ తిరునగరి**

# కార్మికగీతం ఆవిష్కరణ



ఆగస్టు 10న హైదరాబాద్‌లో సుందరయ్య విజ్ఞానకేంద్రం, దొడ్డికొమరయ్య హాలులో 'కార్మిక గీతం' పుస్తకావిష్కరణ. చిత్రంలో ఓల్గా, తెలకపల్లి రవి, కె. శివారెడ్డి, ఆర్. సుధాభాస్కర్, పుస్తక రచయిత అక్కినేని కుటుంబరావు

ఆగస్టు 10న హైదరాబాద్‌లో, సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో జరిగిన సభలో అక్కినేని కుటుంబరావు కార్మికలోకం నవలను ప్రస్థానం సంపాదకులు తెలకపల్లి రవి ఆవిష్కరించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ కార్మికుల జీవితాలను సహజంగా కుటుంబరావు ఈ నవలలో చిత్రించారని అన్నారు. వెయ్యేళ్ల తెలుగు సాహిత్యంలో కార్మికుల గురించి అతి కొద్ది నవలలు మాత్రమే వచ్చాయని, వాటిల్లో ఇది ముఖ్యమైందని అన్నారు. వర్గ చైతన్యాన్ని ప్రతిబింబించే నవలల్లో కార్మికగీతం ప్రధానమైందన్నారు. కుహనా దళారి కార్మిక నాయకుల తీరువల్ల కార్మిక వర్గానికి జరిగే అన్యాయాన్ని ఈ నవల కళ్లకు కట్టినట్లు చూపించిందన్నారు. ప్రజల హక్కులను హరించే క్రమంలో ప్రపంచీకరణ పరిస్థితుల్లో, రాజీవ్‌గాంధీ నూతన ఆర్థిక విధానాలు ప్రవేశపెట్టిన కొత్తలో ఈ నవల రాయటం వల్ల కార్మిక లోకానికి మేలు జరిగిందని రవి అన్నారు. సిఐటియు నాయకులు ఆర్. సుధాభాస్కర్ మాట్లాడుతూ కార్మిక లోకం కుటుంబరావుకు రుణపడి వుందని, పెట్టుబడిదారీ సమాజం, దోపిడీ కొనసాగుతున్న క్రమంలో ఈ నవల వచ్చిందన్నారు. ప్రపంచీకరణ వేగవంతమై దోపిడీస్థాయి పెరిగిన సమకాలీన పరిస్థితుల్లో ఈ నవల ప్రాధాన్యత పెరిగిందన్నారు. కార్మికుల జీవితాల లోతుల్లోకెళ్లి పరిశీలన, అధ్యయనం చేసి అక్కినేని కుటుంబరావు, 'కార్మిక గీతం' నవలను రచించాడని అన్నారు. ప్రముఖ కవి శివారెడ్డి సభకు అధ్యక్షత వహించగా ప్రముఖ స్త్రీవాద రచయిత్రి ఓల్గా సభలో పాల్గొని ప్రసంగించారు.

## కవితలకు ఆహ్వానం

అనంతపురం జిల్లా సాహితీస్రవంతి ఆధ్వర్యంలో జిల్లా కవితా సంకలనం వెలువరిస్తున్నట్లు అనంతపురం జిల్లా సాహితీస్రవంతి ప్రధాన కార్యదర్శి తగరం క్రిష్ణయ్య తెలిపారు. ప్రపంచీకరణ, సామ్రాజ్యవాదం, మతోన్మాదం, మార్కెట్ మాయాజాలం, అధికధరలు, మహిళ, దళితులు, పేదరికం, ప్రకృతి వైపరీత్యాలు, రైతులు, చేనేత, ఆత్మహత్యలు, భ్రూణ హత్యలు తదితర సామాజిక సమస్యలపైన కవితలు పంపవలసిందిగా కోరారు. 25 లైన్లకు మించకూడదని కోరారు. కవి హామీతో పాటు రెండు పాస్‌పోర్టు సైజు ఫోటోలను పంపించాలి. కవితలు పంపించవలసిన చిరునామా: తగరం క్రిష్ణయ్య, ఇంటి నెంబరు 1-152, సుశీలారెడ్డి కాలనీ, ఇంజినీరింగ్ కాలేజి దగ్గర, అనంతపురం చిరునామాకు సెప్టెంబరు 15 లోపు పంపవలసిందిగా కోరారు. ఇతర వివరాలకు 9440578404 ద్వారా సంప్రదించగలరు.

# పుస్తకం చదవని జీవితం వ్యర్థం



ప్రజాశక్తి బుక్‌హౌస్ విజయవాడ నూతన భవనాన్ని ప్రారంభించి ప్రసంగిస్తున్న బి.వి. రాఘవులు

పుస్తకం చదవని జీవితం వ్యర్థమని సిపియం రాష్ట్ర కార్యదర్శి బి.వి. రాఘవులు అన్నారు. విజయవాడ కారల్‌మార్క్ రోడ్‌లో అధునాతనంగా నిర్మించిన ప్రజాశక్తి బుక్‌హౌస్ నూతన భవనాన్ని ఆగస్టు 25న ఆయన ప్రారంభించారు. అనంతరం హోటల్ ఐలాపురంలో జరిగిన సభలో ఆయన మాట్లాడారు. పుస్తకాలు చదవకపోతే వెనకబడిపోవటంతోపాటు విజ్ఞానాన్ని కోల్పోవాల్సి వస్తుందన్నారు. గంట టీవి చూసినవారిలో చూడనివారికంటే తెలివితేటలు తక్కువగా ఉన్నాయని సర్వేల్లో తేలిందన్నారు. మనిషికి టివి ఫాస్ట్‌ఫుడ్ అయితే పుస్తకం సహజ ఆహారం వంటిదని అన్నారు. ప్రజాశక్తి, విశాలాంధ్ర వంటి పుస్తక విక్రయ సంస్థలు అభ్యుదయ, సామాజిక సాహిత్యాన్ని ప్రోత్సహిస్తున్నాయని తెలిపారు. 'కమ్యూనిజం' పత్రిక ఎడిటర్ గద్దం కోటేశ్వరరావు మాట్లాడుతూ ప్రతి ఒక్కరికీ పుస్తకం ద్వారానే శాస్త్ర విజ్ఞానం వస్తుందన్నారు. పిడిఎఫ్ ఎమ్మెల్సీ కె.ఎస్. లక్ష్మణరావు మాట్లాడుతూ చరిత్ర అవసరంలేదని కొద్దిమంది ప్రచారం చేస్తున్నారనీ, మానవ జీవనం ఉన్నంతకాలం సామాజిక శాస్త్రాల అవసరం ఉంటుందనీ చెప్పారు. విజయవాడ బుక్ ఫెస్టివల్ సొసైటీ అధ్యక్షులు అశోక్ కుమార్ మాట్లాడుతూ ప్రస్తుతం గ్రంథాలనూ, గ్రంథాలయాలనూ నిర్వీర్యం చేసే పద్ధతి కొనసాగుతుందన్నారు. సభాధ్యక్షులు మార్క్సిస్టు మాసపత్రిక ఎడిటర్ ఎస్. వెంకట్రావు మాట్లాడుతూ సామాజిక, సాంకేతిక, విజ్ఞానశాస్త్రాలతో పాటు పిల్లల సాహిత్యాన్ని ప్రజాశక్తి బుక్‌హౌస్ అందిస్తోందని చెప్పారు. ప్రజాశక్తి బుక్‌హౌస్ మేనేజర్ కె. లక్ష్మయ్య, నవోదయా పబ్లికేషన్స్ అధినేత ఎ. రామమోహన్‌రావు, న్యూ స్టూడెంట్స్ అధినేత బాబ్జి, విజిఎస్ పబ్లిషర్స్ అధినేత రామారావు, విక్రం పబ్లిషర్స్ అధినేత రామస్వామి, శ్రీశ్రీ ప్రింటర్స్ అధినేత విశ్వేశ్వరరావు, శ్రీవేంకటేశ్వర బుక్‌డిపో అధినేత ఐ. రాంకుమార్, జయంతి పబ్లికేషన్స్ అధినేత పెరుమాళ్ళు కుమారుడు సుబ్బరామయ్య, ప్రజాశక్తి బుక్‌హౌస్ విజయవాడ మేనేజర్ మారుతీ శ్రీనివాస్ తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.




కవి సంగమం సమ్మేళనంలో కవిత చదువుతున్న ఖమ్మం జిల్లాకు చెందిన కన్నెగంటి వెంకటయ్య. వేదికపై గుడిపాటి, అఫ్సర్, బి. నర్సింగరావు, నందూరి మూర్తి, సుభోద్ సర్కార్, కె. శివారెడ్డి

## కవుల సంగమం

ఆగస్టు 15న హైదరాబాద్‌లోని ఇఫ్లూ యూనివర్శిటీలో కవి సంగమం పేరుతో కవి సమ్మేళనం జరిగింది. కవి యాకూబ్ ఇటీవల ఫేస్‌బుక్‌లో ఒక గ్రూప్ తెరిచి కవితలు ప్రచురించడం ప్రారంభించారు. ఆ కవులందరితో పొయెట్రీ ఫెస్టివల్ పేరుతో ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. ఆ రోజు మధ్యాహ్నం జరిగిన ప్రారంభసభలో పశ్చిమబెంగాల్‌కు చెందిన ప్రముఖ కవి సుభోద్ సర్కారు ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. ఈ సభలో ప్రముఖ కవి శివారెడ్డి, ప్రముఖ దర్శకులు బి. నర్సింగరావు, అఫ్సర్, గుడిపాటి, యాకూబ్ పాల్గొని ప్రసంగించారు. నందూరి మూర్తి అధ్యక్షతన జరిగిన ఈ సభలో ఆధునిక పరిజ్ఞానాన్ని ఉపయోగించుకుని తెలుగు కవులు ఫేస్‌బుక్‌లో కవితలు ప్రచురించుకోవడం ఒక మంచి పరిణామమని వక్తలు పేర్కొన్నారు. ఈ కార్యక్రమ రూపకల్పన చేసిన కవి యాకూబ్‌కు అభినందనలు తెలిపారు. అనంతరం స్కైబాబ ఆధ్వర్యంలో జరిగిన ఈ కవి సమ్మేళనంలో పలువురు తమ కవితలు చదివారు. సీనియర్ కవులతో పాటు ఔత్సాహికులు ఈ కవి సమ్మేళనంలో పాల్గొన్నారు.

## స్పందన మానవీయత, హృదయ స్పర్శ, కరుణరసం కలిగివున్న కథ

మనుష్యులు నిశ్శబ్దంగా నిష్క్రమించడంలో కలిగే విషాద అనుభూతి ఐక్యత, క్రమానుగత శోక ఉపశమనం.. బాధామయ, విషాదభరిత దీర్ఘ నిష్క్రమణలలో ఓ పట్టాన లభ్యం కావు. దురదృష్టవశాత్తు ఆధునిక జీవన విధానంలో పెరుగుతున్న జీవన వ్యవధితో పాటు భయానకమైన జబ్బుల పరంపరలూ అధికమవుతున్నాయి. గతంలో కలరా, ప్లేగులాంటి వ్యాధులు జనజీవనాలను అతలాకుతలం చేసి మానవ సమూహాలను తుడిచి పెట్టేసేవని చరిత్ర తెలుపుతోంది. వాటిని అరికట్టగలిగాయి ఆధునిక వైద్య ఆరోగ్య విధానాలు. ఆమధ్యకాలంలో క్షయవ్యాధి ఒకరినుండీ, ఒకరికి దావానలంలా విస్తరిస్తూండేది. దానినీ జ్వరంలాంటి సాధారణ స్థాయికి తీసుకు రాగలిగాయి ఆధునిక ఔషధాలు.కానీ.. పరిమితంగానే అయినా మనిషి మనుగడను నిలదీసి ప్రశ్నిస్తున్నాయి... క్యాన్సర్, హెచ్.ఐ.వి., ఎయిడ్స్ లాంటి అత్యాధునిక అలివికాని జబ్బులు.. అవయినా... ఎక్కువగా చిన్న వయసుల వారిని వరిస్తూ! వైద్యునిగుండె రాయిలాంటి దంటారు. కానీ వైద్య శాస్త్రానికందని రోగాల బారిన పడిన ఆత్మీయుల వద్దకొచ్చేసరికి ఆ రాతి గుండె సైతం కరిగి నీరయి చెరువుగా మారుతుంది. అదే ఈ కథలోని వస్తువు.

ప్రకృతి మధ్యన పచ్చని నిండడివిని కార్చిచ్చు దహించి వేస్తుంటే నిస్సహాయంగా చూస్తూ నిలబడే మనిషి యొక్క మూగ హృదయవేదన ఈ కథ తాలూకు నడక. ఈ నడకలో అడుగడుగునా పాఠకుడి గుండె స్పందిస్తుంది, కంటతడి కదులుతుంది.

అమృత మందించి ప్రాణం పోయాల్సిన చేతులతో విషాన్ని అందించి అంతానికి చేరువ చెయ్యడంలోని క్రూరమైన విషాదం ఈ కథకు ముగింపు.

సంవత్సరాల తరబడి వైద్య వృత్తిలో గడిచిన అపార పరిజ్ఞానాన్ని, సుదీర్ఘమైన జీవితానుభవాన్ని కలగలిపి రంగరించి డా॥ మల్లెమాల వేణుగోపాల రెడ్డిగారు అందించిన ఓ విషాద గాధ 'కారుణ్యమరణం'

డా॥ మల్లెమాల వేణుగోపాలరెడ్డి గారి కథలు కొన్నింటిలో ఓ ప్రత్యేకత కన్పిస్తుంటుంది.. ఆ కథలను వారు నవలలుగా వ్రాసి ఉండవచ్చు... కానయితే వారు కాథలుగానే వ్రాస్తుంటారు. పై కోవకు చెందేదే 'కారుణ్యమరణం' కథకూడా. ఈ కథలో మానవీయతా, గొప్ప హృదయస్పర్శా, కరుణరసాలు కలగలిపి వున్నాయి.

రచయిత అభినందనీయులు

**– టి.ఎస్.ఎ. కృష్ణమూర్తి**, మదనపల్లి, చిత్తూరు జిల్లా

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

# తాపీ ధర్మారావు

19.09.1888 - 08.05.1973



తాతాజీ అని పిలిపించుకున్న తాపీ ధర్మారావు హేతువాద భావాలుగల కవి, రచయిత, సంపాదకుడు. దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు, పెళ్లి, దాని పుట్టుపూర్వోత్తరాలు వంటి పుస్తకాలతో హేతువాదులు అనిపించారు. కొత్తపాళి, పాతపాళి, విజయవిలాసము వంటి సాహిత్య గ్రంథాలు, స్క్రీన్‌ప్లే, సంభాషణలు రాశారు.

SHAITYA PRASTHANAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.H/SD/415/10-12

PRSVMOZA141

# ప్రజాశక్తి బుక్‌హౌస్ తాజా ప్రచురణలు




వెల: రూ. 40/-




వెల: రూ. 200/-




వెల: రూ. 25/-




వెల: రూ. 30/-




వెల: రూ. 40/-









వెల: రూ. 20/-




వెల: రూ. 150/-




వెల: రూ. 20/-




వెల: రూ. 50/-




వెల: రూ. 100/-




వెల: రూ. 20/-










వెల: రూ. 35/-




వెల: రూ. 40/-




వెల: రూ. 20/-




వెల: రూ. 50/-




వెల: రూ. 150/-

ప్రతులకు: ప్రజాశక్తి బుక్‌హౌస్, ఫోన్: 040-27660013 27608107, ఫ్యాక్స్: 04027635136

**If Un delivered please return to :** Prasthanam, C/o M.H.Bhavan, Plot No. 21/1, Azamabad
Near RTC Kalyanamandapam, Hyderabad - 500 020 (A.P), Ph: 040-27660013, Cell: 9490099059

50



## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A141 |
| పుస్తకం పేరు | ధ్యానం |
| తారీఖు | 25-5-2[illegible] |
| ముందు అట్ట | yas |
| వెనుక అట్ట | yas |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | K.Daveed |
| పేజీలు విడదీసినది | K.Daveed |
| స్కాన్ చేసినది | Gayatri |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | GOOD |